# ప్రణయకుసుమము

దీపాల పిచ్చయ్యశాస్త్రి
కృతము

ఆంధ్రజనని ముద్రణాలయమున
ముద్రితము
౧౯౨౨



వెల ౧౨ అణాలు

పునరుజ్జీవనములు రెంటను సమానములే. కాని కథాపర్యవ
సానములు మాత్రము భిన్నములు. నిర్వేదనాటకములో
భర్తృహరి పునరుజ్జీవిత యైన భానుమతితోడి కాంపుర
మొల్లక గోరక్షనాథుని వలెఁ దానును నివృత్తసంసారుఁ
డగును. ఈ కృతిలో వసంతుఁడు జ్ఞానమును బొరసి, సంసార
ము మోక్షప్రతిబంధకము గాదని మల్లికను గైకొని, మైథిలుఁ
డగు జనకునివలెఁ గుటుంబభోగముల ననుభవించును. జ్ఞానులు
సంసరింతురా యను విషయము వేదాంతశాస్త్రమునకుఁ జేరి
నది. ఇటుఁ దద్విమర్శనము మన కనవసరము. కాని తుల్యారం
భములు గల కథలు భిన్నపర్యవసానము లగుట యేల యనుట
మాత్రము మన మరయవలసియున్నది. నిర్వేదనాటకము
ప్రబోధపరము. దానికి 'భర్తృహరి ప్రబోధ' మని కూడ
నామాంతరము కలదు. జ్ఞానపూర్వక మగు వైరాగ్యమును
స్థాపించుటయందే కవి కిందుఁ దాత్పర్యము. ఈ కృతి యట్టిది
గాదు. ఇది ప్రణయతత్త్వనిరూపణైకపరము. ఇందు మల్లికా
మరణముతోడనే ప్రణయముయొక్క పారము ప్రకాశిత
మైనది. పాతివ్రత్యముయొక్క పరమోచ్చపదవి ప్రతిష్ఠిత
మైనది. ఇఁకఁ దక్కుఁగలకథాభాగ మేల యన నది యిష్టరస
సిద్ధికొఱకు. శిష్టజనప్రీతికొఱకు. కావ్యమునకు మంగళాంతత్వ
మొదవుకొఱకు. మల్లిక బ్రతికి వసంతునితోఁ గూడకున్న

బఠితృజనహృదయములు పల్లవించునా? అకలంకమైన శృంగారముతో నారబ్ధమైన ప్రణయమునకు అనురూపపూర్తి సంఘటిల్లునా? ఇట్టి యభిప్రాయముచేతనే, ప్రబోధనాటకములో నుత్తరార్థమునఁ బ్రపంచితమైన విషయదోషదర్శనము సాక్షేపించి శాస్త్రిగారు ఈకృతిలో మల్లికావసంతుల పునస్సమాగమమును వర్ణించిరని నేను దలంచుచున్నాను. ప్రబోధకృతిలోని రసము శాంతము. ఇందుఁదోఁచునది కరుణ(విప్రలంభ)మే.

హరిహరోపాధ్యాయుని కృతివలెనిది దృశ్యప్రబంధము కామి, కవి కథాంతరన్యాసములకును, వర్ణనలకును, అనల్పమైన యవకాశము గలిగినది. ఆయవకాశమును గవి మిక్కిలి చక్కఁగా వినియోగించుకొనె ననుట యతిశయోక్తి కాదు.

ప్రథమపడిశములోని దివసావసానవర్ణనము, ద్వితీయమందలి సూర్యోదయవర్ణనము, తృతీయమున మల్లికాసౌశీల్యవర్ణనము - ఇట్టివి యీ తెగకుఁ జేరినవి. ఈ వర్ణనములు పరిమితములై కథాసరణికి భంగకరములుగాక తదుద్దీపకములై, యొప్పారుచున్నవి. వర్ణనలవలెనే, సంభాషణలును, ఎట్టెట్టో తెచ్చిపెట్టుకొన్న యవిగాఁ దోఁపక సాధ్యమగునంతవఱకు సందర్భశుద్ధి కలిగి హృదయంగమములుగా నున్నవి. సంధ్యాసమయమునఁ బద్మినికిఁ గలిగిన యనవిరహమునకు మల్లిక దుర

పిల్లఁగా, వసంతుఁడు సంయోగ వియోగములు సహజము లని తెలిపి,

> గీ. 'పద్మినికి సూర్యునకె కాదు పడఁతి! కలువ
> కన్నెకును జంద్రునకు నంత గాదె, మఱియుఁ
> దలఁపఁగా మల్లికావసంతులకు నంత
> గాదె, జగమంతకును నంత గాదె కడకు'.

అని సామాన్యమును జెప్పుచోటఁ గుందకుసుమాకర పరముగా నతనిచేఁ గవి మల్లికావసంతుల ప్రస్తావమే సేయించుటయుఁ, దదీయానురూప దాంపత్య సుఖాతిశయ మున్గడించుచు 'భావ్యర్థమెవ్వఁడెఱుఁగు'నని సందియము వెలయించుటయు, మల్లికాభవనమున 'లక్ష్మీకటాక్షము' 'తాండవమాడు' చున్న దని పలికి వెనువెంట భోగాస్థైర్య వర్ణనమున కుపక్రమించుటయు - ఇట్టివి యింకను గొన్ని సూచ్యార్థ సూచకములై కావ్యశిల్పమునఁ గవి చూపిన జాగరూకతను వెల్లడించుచున్నవి. ధారాశుద్ధి వలనఁ బద్యములన్నియు హృద్యములుగా నున్నను కథాపురుషులలో ముఖ్యులైన మువ్వుర సంభాషణముల నుండి రుచిరతరములైన మూఁడు గీతములమాత్ర మిందుదాహరించుచున్నాఁడను.

ప్రేమతత్త్వ మభివర్ణించుచు మల్లిక:—

> గీ. "సంజఁ బ్రియుఁబాసి శోకించు చక్రవాకి
> తియ్యని యెలుంగునం దోఁచు తేటపలుకు

> లక్ష్యయో నాథ! ప్రేమ తత్త్వార్థబోధ
> సూత్రములుగావె? మృదుమనస్కులకుఁ దలఁప".

వసంతుని విలాపములో:—

> గీ॥ "పరమకల్యాణి! నీ పుణ్యపద పరాగ
> మొనసి సోఁకిన యంతనే తనకుఁదాన
> కదలి ప్రీలదె నాకంబు గవనితలుపు
> పేర్మి నెదురరాఁ దెఱగంటి పేరఁటాండ్రు."

తపోధనుఁడు చేసిన బోధలో.—

> గీ॥ "మృణ్మయం బని నిరసించె కేటికోయి
> ప్రేమతత్త్వంబు నెఱుఁగని పిన్నవాఁడ!
> మృణ్మయం బైన, కాక హిరణ్మయంబె
> యైన, వెలసమమే ప్రణయాపణమున."

'పురంధ్రీణాం చిత్తం కుసుమసుకుమారం హి భవతి' యను భవభూతి వాక్యమునకును, 'ఆశాబంధః కుసుమసదృశం ప్రాయశో హ్యంగనానాం। సద్యః పాతి ప్రణయిహృదయం విప్రయోగే రుణద్ధి' యను కాళిదాసు నాశయమునకును 'కుసుమములకన్న నొకవేళఁ గోమలములు' అని స్త్రీల చిత్తమును గూర్చి చెప్పిన శ్రీనాథుని నుడికారమునకును ఈమల్లికా చరితము తార్కాణముగా నున్నది. శాస్త్రచోదిత మని భర్తృచితాగ్ని నపేక్షించిన ధర్మపత్ని యాచరణము లోకపూజ్యమే. కాని, సద్యస్సముత్పన్న వియోగాగ్నిలో ప్రమందిన

సాధ్వీమణి ప్రభావము అతిలోకము. ఈతారతమ్య మీ ప్రబంధమున నెంతయుఁ జక్కఁగాఁ బ్రదర్శింపఁబడినది.

ఈ దివ్యప్రసవార్చనమున సుప్రసన్నయై ఆంధ్రవాగ్దేవి కృతికర్తృకృతిభర్తలను ఇతోఽధికయశస్సంపదల నోలలార్చుఁగాతె.

నెల్లూరు }
1-4-1922 }

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ,
ఆంధ్రభాషోపన్యాసకుఁడు,
కళాశాల, నెల్లూరు.

శ్రీ

# ప్రణయకుసుమము.

ఆశీర్వాదకము.

శ్రీ కల్యాణగుణాంకుఁడు, దైవతశిర
            శ్శృంగారభూషాయితా
స్తోక శ్రీకరపదాంబుజద్వయుఁడు, శ్రీ
            శుం, డాయురారోగ్యసు
శ్లోక శ్రీయుతుఁగా నిరంతరముఁ బ్రో
            చుంగావుతన్ దాసగీ
ష్టైకారంభకునిం గృతీశ్వరుని మా.
            "అష్టాదశసిద్ధేశ్వరున్".

గీ. తనదు పుట్టిల్లు పెద్ద రత్నముల ప్రోక,
భర్త లోకైక భర్త, అపత్య మఖిల
సృష్టికర్తగఁ దగు కల్మిచెలువ కలుము
లిచ్చుఁగావుత సతముఁ గృతీశ్వరునకు

శా. కామం బింతయు నాకులేదనుచు, బింకాల్ పల్కితో ల్తన్,
జగత్ । స్తోమం బచ్చెరువంద నా పయి నెటో చుట్టాలుప
క్కాలు తన్ । ప్రేమింపంగఁ గుటుంబియై సుతుల నర్థింగ
న్న శ్రీశంకరుం । డోముంగాతఁ గృపన్ గృతీశ్వరునిభా
గ్యోపేతుఁగా నెప్పుడున్

సీ. కొదమసింగము నెక్కి కులికెడు నెఱజాణ
అచలాధిపతియింటి యాఁడుబిడ్డ
మగని యర్థాంగంబుఁ దెగఁగొన్న జగజంత
మూఁడు త్రోవల పూవుఁబోఁడి సతతి
గణనాథుఁ గడుపారఁ గాంచిన యిల్లాలు
భక్తులపాలికల్పద్రుమంబు
సంతతోరు కదంబ కాంతార వాసిని
దైతేయ కాంతార దావహేతి

గీ. పాలితాఖిల విబుధలోకాళి కాళి
పరమకల్యాణి, సత్కృపాపరత నిరత
నిసన్నమైశ్వర్య ధైర్య యశస్సమృద్ధి
వృద్ధిగనఁ బ్రోచు నద్దాడ సిద్ధశర్మ

చ. తనుజులఁ బ్రోవ నాపని, యథావిధి వాగ్విదులం బొనర్ప నీ
పని, యను నేమ మొప్పఁగఁ బ్రపంచకుటుంబభరంబుఁ
దాల్చుగాం । చనఁజఠరుండు, తత్సతియు, సారదయామతు
లై చిరాయుపుల్ । మునుకొని వాగ్విభూతి నిడి ప్రోతురు
గాతఁ గృతీశు నెప్పుడున్

చ. కవివదనాంబుజమ్ము లను కమ్మని వాగమృతంపు బుగ్గలన్
బ్రవిమలనవ్యకావ్యరసవాహినులన్ వెడలించి, ప్రాజ్ఞచి
త్తవిపుల, భావసస్యము సతంబు ఫలింపఁగజేయు తల్లిన
స్నవికలసత్కటాక్షకలనాదృతి వాణియనుగ్రహించుతన్

> గీ. పేరు వెనకయ్య యయ్యును వేల్పుగమికి
> ముందు పూజలుగొను పెనుబొజ్జసామి
> భక్తి నీ కృతిముఖమునఁ బ్రస్తుతింతు
> వారక యవిఘ్నశోభనావాప్తి కొఱకు.

ఉ. వితతకవిత్వతత్త్వపదవీనదవీయ ఉదాత్తకీర్తి
ర్వితికవి వేంకటేశకవి పండితులన్ గురులన్ దలంచి, స
త్కృతిరచనా చమత్కృతి సుధీనుతధీవిలసత్పురాతనా
ద్భుతనకవీంద్రవాగ్విభుతకంజలిఁ జేసెద వాగ్విశుద్ధికై

గీ. ప్రౌఢదీర్ఘసమాసగుంభనపటిష్ఠ
ఘనతఁ గాంచదె శుకశిష్టము, సలపుఁ జవులఁ
గులుకు పలుకులయెడఁ బ్రేమ గాంచదెకని
సమయ మెఱిఁగి యెంచను సమ్మతములె-

ఉ. ఇంచుక యుక్ గవిత్వమన నేమొయెఱుంగనియద్దెయుంగృతిం
గాంచి, హసించు, దిద్దుఁ, బలుగాకులుత్రాసియాడసట్టిదో
గొంచెము, గొప్ప, నేర్పు, లని, కుత్సితబుద్ధిఁ గవీశనిర్మితో
దంచితకావ్యముం జెఱకు నాతనిఁ గాకవి దిట్టనేటికిన్

క. గుణికిం గుణ మగపడు, నవ
గుణికిం గృతి నవగుణంబె గురుతుగఁ దోఁచుం
గణఁక ముకురమున ముఖ ల
క్షణములు నెవ్వారివట్ల కన్పడులీలన్

గీ. మధురరసపూర్ణసుకృతిసుమంబు రసిక
బంభరముఁ దన్పుఁ గాని, దుర్వార దుర్వి
దగ్ధవాదిశ్మశానసంగ్రథంబుఁ దనుప
నేర్చునే? యోర్చునే? దాని నిష్ఠురతను

# అవతారిక.

---

క. ఏదే నొకకృతిఁ గూర్పఁగ
మోదం బిగురొత్తఁగా నపూర్వకథా సం
పాదనమతినై వెదకుచు
నే దినములు పుచ్చుచుంట నెఱిఁగిన కతనన్

క. మన్మిత్రుఁడు, పౌత్రుఁడు, ధీ
మన్మాన్యుఁడు, సుకవితాభిమానియును నుదా
రోన్మనుఁడు, సిద్ధశర్మన
ను స్మత్సన్నసఁ గాంచిపలికె నూల్కొను ప్రేమన్

క. దీపాల వంశ వరమణి
దీపాయిత! మృదులమధురదీవ్యత్కవితా
వ్యాపార! రసికతాపద
వీపారగవాగ్విలాస! పిచ్చయ శాస్త్రీ!

సీ. కూర్చితి విడుములకోర్చి యింతకుమును
పల చాటుపద్యరత్నాకరంబు
రచియించితివి భక్తిరస ముట్టిపడునట్లు
ప్రౌఢిమై భక్తకల్పద్రుమంబు
విరచించితివి చాటువృత్తిమ్ము విప్పి యు
ల్లారు ముద్దుగ మొన్న భారతి కృతి
చేర్చితి వోగి సుభాషితసుధాలహరి భా
షావధూటి కొక భూషణముగాఁగ

గీ. ఆశుకవితావధాన విద్యావినోద
బంధురుండవు, ప్రౌఢప్రబంధరస
దక్షుఁడవు, మాకు హితుఁడవుదాత్తమతివి
సరవిఁ దీర్పుఁమ నా యభీష్టమ్ము కండు.

గీ. ఇచ్చితివి నాకుఁ నొక రెండు కృతుల సంక
తముగ మున్నైనసఁగిల దీప్సితమ్ము మఱియు
నొక్క సత్కృతిఁగైకొన నోసర మామ
కీస జననీ జనకుల కంకితము గాఁగ.

వ. కావున.

క. సాధ్వీచరితగ నొకకృతి
మాధ్వీకరసప్రసారమంజువచస్కన్
సాధ్వభినంద్యను నొసఁగుముఁ
పృథ్విని మద్వంశగరిమ పెంపు వహింపన్.

వ. అని కోరుటయుఁ బ్రబంధరచనాసముద్యోగినై యున్న నాకు సుహృదభీప్సితంబు మఱింతచేయూఁత నొసఁగ ''నేకాక్రియాద్వ్యర్థకరీబభూవ'' యను న్యాయమునకుఁ దార్కాణగా నేనీచిఱుతకృతిరచియింప సమకట్టితి.

క. అరుదగు నీకృతి మాతృక
హరిహరకవిరచిత ''భర్తృహరి నిర్వే'' దో
త్తరకృతియగు నైసరస
స్ఫురణయుఁ గథ దాని పోల్కిఁ బొసఁగదు దీనన్.

క. నేనాసత్కృతినుండి ప్ర
థానాంశము నెత్తుకొని యథామతి నీ కా
లానుసృతి మార్చి నూత్నక
థాసక మేర్పఱచితిని ముదంబిడు ననుచున్.

గీ. ప్రథితపండితకవికృతగ్రంథములకుఁ
బ్రతిగఁ గృతులను మాదృశుల్ వ్రాయుచుంద్రు
బ్రహ్మనిర్మించు బ్రహ్మాండ భాండములకుఁ
బ్రతిగఁ గుమ్మరిసేయు మృద్భాండములను.

క. దోసఁగొకచోఁ బొసఁగిన, నీ
రసతయుఁ దోఁచినఁ గృపాతరంగితమతు లీ
రస మూనఁ బోక కవితా
రస మానుఁడి యున్నవట్లు ప్రాజ్ఞమతముగ

---

# కృతిపతివంశము

---

గీ. బ్రహ్మముఖసీమ మొలకెత్తి పొదుగొనిన
విప్రసంతానవృక్షమ్ము వితతశాఖ
లందు నొకఁడయి ప్రబలి పెంపొందెమిగుల
నాఁటికిని నేఁటికిని వెలనాటిశాఖ.

మ. ఘనమౌ నా వెలనాటిశాఖఁ గనువిఖ్యాతిం బ్రవర్ధిల్లె గో
ధనధాన్యాసమశీల సద్వినయ విద్యాగౌరవ స్ఫూర్తితో
ననవద్యామలకీర్తితో విపులమై "అడ్డాడ" వంశంబు పా
వనవంశంబులనగ్రగణ్యమగుచున్ వాధూలగోత్రంబునన్

క. ఆ వంశంబునఁ బొడమి, బు
ధావళి తనుఁ బొగడనెగడె, ననఘుఁడు, వర వి
ద్యావిదుఁడు, సాంబశివపద
సేవానిరతుండు సాంబశివుఁ డలఘుండై

గీ. సాధుసన్నుతచరితుఁ డా సాంబశివుఁడు
పెరిమ గరిమయుఁ బొలుపారఁ బెండ్లియాడె
నన్నపూర్ణకు నుద్దియా నన్నుమిన్న
సురుచిరగుణకదంబ శ్రీసుబ్బమాంబ

క. ఆ యుత్తమ దంపతులకు
శ్రీయుతుఁడసమానగుణవిశేషోదయుఁడో
జోయుతుఁడు పుట్టె బుధు లౌ
రా యన గురుమూర్తి సద్గుణాలంకృతుఁడై.

క. ఉరుకీర్తికాముఁడగు నల
గురుమూర్తి పరిగ్రహించె గురుజననుత స
చ్చరితను కామాక్షీసతి
గిరిశుఁడు గిరిజాతఁ గొన్న కీలునఁ బ్రీతిన్

మ. కలిగెన్ బుత్త్రికుఁ డాద్విజోత్తమునకాకామాక్షికిన్ సద్గు
ణం । బులప్రో వాశ్రితపారిజాతతరు వంభోరాశి గంభీరుఁ
డ । త్యలఘుశ్రీనిధివేంకనాభిదుఁడు, దీవ్యద్దివ్యవాగ్వైభ
వో । జ్జ్వలుఁడై పేర్గనె దానదాపనవిధివ్యాపారపారీణుఁడై

గీ. అనృతము వచింపఁగ నెఱుంగ దతని రసన
యాచకున కీయ వెనుదీయ దతనికరము
అపహాసము నెన్నఁడును బూన దతనిమనము
కలఁడె సుజనుండు వేంకన్న కన్న మిన్న.

గీ. ఆ సుగుణి గృహిణియు నిరతాన్న దాత్రి
దీనజనకల్పవల్లి సతీమతల్లి
శీలసంపద్విశాల చుట్టాలసురభి
సరససుగుణసమాలంబ సరసమాంబ

ఉ. వైదికలౌకికోన్నత సభాస్థలులన్ దననేర్పెలర్ప న్యా
యోదయఫక్కినై మడమనూరుపురంబున న్యాయవాదియై
వాదమొనర్చి, యట్లు ప్రతివాదము సల్పి యశంబుఁగన్నవి
ద్యాదయితుండు వేంకనముందంబునఁబుత్రులఁగాంచె నేవురన్

వ. తత్కుమారపంచకంబునం దగ్రజుండు

క. లక్ష్మీవంతుఁడు, విబుధుఁడు
లక్ష్మీనారాయణాఖ్యలలితుఁడు, ధృతిమే
రుక్ష్మాధరతుల్యుఁడు, స
ర్వక్ష్మాజనవినుతకీర్తి ప్రథితుండలరున్

సీ. పదుగురిలో తనుమెచ్చఁ బ్రతిఘటించి మా
టాడు వారలకు సడ్డాడ నేర్పు
సాధుల కపకృతి సల్పఁగానెంచి కా
రాడు వారలకు సడ్డాడనేర్పు
అన్యాయపథమూని యార్యులతోడఁ బో
రాడు వారలకు సడ్డాడనేర్పుఁ
గాని కార్యముసకై కసిపట్టి కడఁగి మ
ట్టాడు వారలకు సడ్డాడనేర్పుఁ

గీ. బ్రోడ, సుమహితచరితుఁ "సడ్డాడ"వంశ
కలశవారాశిసీహారకరుఁడు, ఘనుఁడ
తండు సామాన్యుఁడే మహోదారుఁడా శ్రీ
తావనపరాయణుండు నారాయణుండు.

సీ. ప్రస్తరించె ముదంబు భక్తిమై సేవించి
తగురీతిఁ దన తల్లిదండ్రులకును
బెట్టించె మిగుల సంప్రీతి నన్నంబు లే
దనకుండ నడిగిన యతిథికెల్ల

పొసరించె ధీదర్పమున గ్రిద్దలూరను
పురలలామంబునఁ గరణికమ్ముఁ
దూలించెఁ బ్రాజ్ఞస్మృ దురితాద్రులను గాము
తారకమంత్ర శతారధార

గీ. సరసమిత్రులఁ దనసహోదరులరీతి
నోగిఁబరామరిసించె బంధూత్కరంబు
జరిపెఁగాలంబు వైదికాచారనిష్ఠ
నార్యసన్నుతగుణుఁడు నారాయణుండు.

గీ. లలిత నారాయణార్ధాంగలక్ష్మి లక్ష్మి
నెనయఁజాలిన యిల్లాలు వినుతచరిత
మంజులాలాప పతిభక్తమనికిపట్టు
భవికగుణధన్య మాన్య సుబ్బమపురంధ్రి

గీ. సుబ్బమాంబక ప్రాజ్ఞని సుకృతఫలము
భవ్యనారాయణోర్జిత భాగ్యరేఖ
పుట్టువందెను దద్వంశపుణ్యగరిమ
సిద్ధసంకల్పకుండు మాసిద్ధశర్మ.

సీ. ముచ్చటించెఁ దెలుఁగు ముద్దులగుమ్మతోఁ
నారసి రసికు లౌనా ననంగఁ
గలిగించుకొనియె ధీకలన గీర్వాణ భా
షాసతి ముఖపరిచయము కొంత
పొనరించెఁ దగనేస్తమును హూణవాణితోఁ
బరిపాటి సరిసాటి వారలెన్న
ఒనరించె రాజకీయోద్యోగమొక కొంత
కాలమ్ము గౌరవాకలన బెరసిఁ

గీ. నిచ్చలును దన్పెఁ గవుల, వనీపకులకు.
"దేహి" యన "నాస్తి" యనకుండఁ దివిరియిచ్చె
నితఁడు సామాన్యుఁడా సుగుణైకరాశి
యిద్ధగుణ సుప్రసిద్ధుండు సిద్ధశర్మ.

సీ కాశి కేతెంచి విశ్వేశుఁ గొల్చి భజించె
నన్నపూర్ణ భవాని నధికభక్తి
నాసయుఁ బచరించె నఘమర్షణస్నాన
మను ముక్తిసీమ శ్రీదివిజగంగ

నటమీఁద నల్పె గయాక్షేత్రమునఁ బితృ
తర్పణంబులుఁ బిండదానవిధులు
కృతులను గైకొని పితృపితామహుల భా
స్వత్కీర్తి ధాత్రి శాశ్వతమొనర్చె

గీ. వినయమునఁ జేసె వేదాంతవిదుల చెలిమి
యర్థిఁబఠియించె నుపనిషదర్థములను
బ్రహ్మమున నిల్పె మనము వైరాగ్య సరణి
నీశ్వరార్చాపరుండు సిద్ధేశ్వరుండు.

చ. సకలగుణంబులన్ దనకుఁ జాలిన మానిని "కృష్ణవేణి" నా
మకసతిఁ బెండ్లియాడి, యసమానయశోవిభవాభిరాముఁడై | ప్రకట సుఖంబు లందుచును భాసిలు ధన్యుఁడు సిద్ధశర్మతా | రక కలకాలమున్ శుభపరంపరలన్ దనివారఁగాంచుతన్.

క. పితాద్యగ్గుణునకుఁ బ్ర
సీతి యశస్సాంద్రునకును సిద్ధేశ్వర వి
ఖ్యాతాభిధాన బుధునకు
పితాఘుశ కమలతత్త్వ విజ్ఞానునకున్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారచియించు ని
కావ్యం బస్మద్దేశికాశీః ప్రభావంబున.

క. మంతునకునెక్కుడగ నిజ
కాంతునకసమానయశముఁగడలు కొలిపి, సే
రెంతయుఁగనుఁగాత మిదా
నంతనకవిరచితకావ్య నిచయమునందున్.

———

# ప్ర ణ య కు సు మ ము.

---

## ప్ర థ మ ద ళ ము.

గీ. పెద్ద కాలమునకువచ్చు ప్రియవసంతు
మేలువార్తను వినియె కాఁబోలుఁ జిగురు
జొంపములఁ బూల మొగ్గల సొగసుచేసి
కొసఁగ మొదలిడె ముదమున వనలతాంగి.

గీ. పుష్పవతియయ్యె మల్లికా మోహనాంగి
వరుసఁ గాదంబినియును గర్భంబుఁ దాల్చె
ఘనరసాలతరుశ్రేణి కడుపుపండె
హర్షదాయక మగు వసంతాగమమున.

గీ. తళుకు బెళుకుల పూవులఁ దావు లదికి
పేర్మి నళులకు విరితేనె విందొసర్చె
ఆమ్రపల్లవభుక్తిఁ బికాళిఁదనిపి
సంతసంబు నొసంగె వసంతలక్ష్మి.

గీ. తమ కొసచ్చెఁ మేలెంచి భ్రమరములును
పరభృతమ్ములు నెల్లెడ భవ్యమధుర
మంజులారావ గానసముంచితగతిఁ
బాల పొగడఁగ దొడఁగె వసంతరీతి.

గీ. లతలనూఁతగఁ గొనుచుఁ బల్లవములంటి
చనుచుఁ, గోరకములు కాన గొనుచు మెల్ల
మెల్ల నడయాడనేర్చె సమీర సుతుఁడు
క్రమత బలుపెక్కు సుమనోనురాగమెసఁగ.

గీ. పుష్పాడి కుమారముల మెయి పొలుపు తెలుఁగఁ
బలుమఱును దేనెవాఁకల జలకమార్చి
ఆసుకొనఁ బంపుచుండెఁ సిండారుప్రేమ
మందపవనార్భకుని మధుమాసలక్ష్మి.

వ. అట్టి వసంత వాసరంబుల నొక్క నాఁడు.

ఉ. సంతస మగ్గలింపఁగ వసంతకుమారకుఁ డాత్మపస్త్రైన
ప్రాంత సమంచితోపవనవాటికలన్ విహరింప మల్లికా
కాంతనుగూడి వేడ్కఁజని కామినికిన్ వివరించుచుండె న
త్యంతముఁ బ్రేమపొంగి పొలుపార నవీనవనీవినోదముల్.

చ. లలన! మరాళియోర్తుసలిలంబులఁ గ్రుంకిమృణాళనాళమొం
డెలమిఁ గ్రహించి తాఁబరువు లెత్తఁగఁ దజ్జలజంబు నీటిపై
లలితపుబూవుటోడగ విలాసవిహారము సల్పఁగంటె? లో
పల భ్రమరార్భకుల్ ప్రకృతిభావవిలీనతఁ బాటఁ బాడఁగన్.

సీ. తమి సరోవర తరంగముల నుయ్యెలలూఁగు
నంచదంపతుల నెయ్యంపు నుడులు
బలిసి క్రొవ్వునఁ బరస్పర జిగీషను గూయు
కోయిలజంట కూకూ స్వనంబు
జిలిబిలి పలుకులఁ జేరి ముచ్చటలాడు
శుకశారికల పల్కు సొబగుఁదనము
మకరందపాన ప్రమత్తత ఝుమ్మను
గండు తుమ్మెదపిండు మెండురవము

గీ. లాలకించితి కాదె విశాలనయన
కెరలియారీతి వీణఁబల్కింపఁ గలవె?
యను మనోహరు పల్కుల కన్ను మిన్న
యొసఁగెఁ జిఱునవ్వుచేతఁ బ్రత్యుత్తరంబు.

గీ. "చుట్టుపట్టుల చెట్టుల కట్టి ప్రాఁకి
లీలమెయినల్లె నల్ల వల్లీమతల్లి
చూచితిరె" యను సతికను నాచతురుఁడు
"అవు లతాతన్వుల విధంబు లట్లకాదె".

క. అను పలుకు ములికివలె మన
మును సోఁకఁగ మొగముఁ జిన్నపుచ్చుకొనియె నా
వనితామణి! యా సడిఁగనుఁ
గొని కూరిమి వాలుఁజూపు గుంపులఁ గురియన్

గీ. తమ్మిఁ దిలకించి తనదుపాదమ్ము లరసి
కలువ నీక్షించి తనదు కన్నులను జూచి
ప్రసవగుచ్ఛము గని తన వక్షమరయు
నాథు మన మెంచి తలవంచి నవ్వె నబల.

గీ. నిలువఁ డొక సుమమం దొక నిముస మయినఁ
బువ్వు పువ్వునఁ దమి వ్రాలుఁ బొగరుఁ జూపు
ఝుు మ్మని కొదమతుమ్మెద యెమ్మెకాఁడు
కాంచితే? వాని కొక నీతి కలదె? కాంత!

క. అను సతి కను నాతఁడు ముద
మునఁ గాయకుఁ గాయ చెల్లుపోయెను పదవే
వనజాక్షి! పోద మావల
పనుపడు సెలయేటి తటము పజ్జ కటంచున్

గీ. కౌతుకం బొప్ప నక్కలకంఠకంఠి
కేలుఁ గేలునఁ గీలించి కేళివనము
నందు నా సుందరుఁడు మందమందగతుల
నందు నందును విహరించు నట్టి వేళ

సీ. అడుగడుగునకు నడ్డ మగు పిల్లకాల్వల
వడి దాఁటుచోఁ "జెలి! భద్ర" మనుచుఁ
బొదరిండ్లు దూరుచోఁ "బొలఁతి! జంకెద"వంచు
ముగుద కన్నను తాన ముందు చనుచుఁ
బరిపక్వఫలము కన్పట్టుచోఁ "జవిచూచి
యొసఁగుమా" యని చేత నొనర నిడుచుఁ
బ్రొద్దుతిరుగుడుపూవును జూపి "సతిప్రియు
ననుగమించెడు రీతి నరయు" మనుచు

గీ. “కొమ్మ! వలయు సుమములు కై కొమ్మ”యనుచు
“జూతఫలముల రుచి కొంత చూత” మనుచు
“మించు తిలకంబు లవె తిలకించు” మనుచుఁ
“జూచితివె పోఁక ప్రోకల సొబగు”సనుచు

క. ఆరామరామణీయక
మా రామకు నట్లు చెప్ప చంతంత ముదం
బారఁగఁ గోరిక లూరఁగఁ
జేరెఁ సెలయేటి తటము చెంతకు, నందుఁ

గీ. ఏటి తరఁగల నేస్తమ్ము నెనసి వీచు
కమ్మ తెమ్మెర లెంతో సౌఖ్య మ్మొసంగ
వాలుకావేదిక నతండు పవ్వళించె
ముగుద నుందొడ యుపధానముగ నెసంగ

వ. అంతఁ బ్రభాకర కర ప్రసరణమ్మునఁ గనులకుమిఱుమిట్లుగొల్పుచు నొప్పారు సెలయేటి తళతళలం దిలకించిమించిన హర్షంబున నతండు

క. జరఠారుణాతపమ్ములు
బరువఁగ బంగారు నీటి వాఁకయ వోలెన్
గరముం గనుఁగవకు మనో
హరమై సెలయేఱు మగువ హర్ష మొసఁగెడిన్

వ. శుకపికశారికాదికులసుస్వరభాస్వరతాన మొప్ప, వా
రకముహురాచలత్పృథుతరంగమృదంగరవం బెసంగఁగాఁ
బ్రకృతిరహస్యముం దలఁచి పాడుచు నున్నది భావగీతముల్
సకియరో! యీ సరిద్రమణి సారతరుల్ తలలూఁచి మెచ్చఁగన్

గీ. ఉచ్చభూభాగముల నుండి యుఱికి యుఱికి
పడి గుభాలున దూఁకు నంభస్సు చెదరి
పొంగి పొరలఁగ రేఁగు తుంపురుల సొబగు
కవుల వర్ణనకును మించి క్రాలు సబల!

గీ. అనుచు బహు వర్ణనంబుల సతుల గతులఁ
బ్రమదమును నించు సరససంభాషణములఁ
జరిపె నొక కొంత ప్రొద్దంత జలజహితుఁడు
చరమగిరిఁ జేరుటయు నల సరసుఁ డపుడు

గీ. గాసిఁ బవలెల్లఁ బయనమ్ముఁ జేసిచేసి
బడలికలు వాయ వరుణదిక్ జలజనయన
యింట విశ్రాంతిఁ జెందఁగ నేఁగె నినుఁడు
చాన ! మన కింటి కేఁగఁగ సమయ మయ్యె

వ. అనవుడు సమ్మల్లికాలతాంగి కింశుకప్రవాళబంధూకచ్ఛాయానాయాదంబయి యలరారు సంధ్యారాగంబుఁ దిలకించి

గీ. తన్ను విడి చను ప్రియుఁ మిత్రు నెన్నొ గతులఁ
బులుఁగుఁబలుఁగుల బతిమాలి ముద్దు మోము
కంద విలపించు దినలక్ష్మి కలికి మొగము
చాయ లన నాథ! సంజ కెంజాయ లలమె

గీ. తన మనోహరు నెడబాటుఁ దలఁచి కుమిలి
కుమిలి రోలంబనినదసంకులత నేడ్చు
కమలినీకాంత నెమ్మోముఁ గనిన డెంద
మున భయంబగు - నను కాంత కనియె నతఁడు

క. క్రమముగ సంయోగవియో
గము లవి సహజమ్ము లెల్లకడలను వితగాఁ
గమలిని గతికై వందురఁ
గమలానన! తగునె హృదయ కమలము కమలా

గీ. పద్మినికి సూర్యునకె కాదు పడఁతి కలువ
కన్నెకును జంద్రునకు సంత కాదె? మఱియుఁ
దలఁపఁగా మల్లికావసంతులకు నంత
కాదె? జగమంతకును నంతకాదె? కడకు

గీ. మల్లికాతన్వి కందలి "మల్లికావ
సంతులకు సంతె" యను పల్కు చాల హృదయ
దారకంబయ్యె నెమ్మది తత్తరించెఁ
గొమ్మ కనుఁగవ బాష్పముల్ గ్రుమ్మరించె

గీ. ఎంత మృదులమొ గాని పూర్ణేందువదన
మనము నీఱయ్యె నొక మాటమాత్రముననె
ఎట్టి ప్రణయమొ కాని పద్మేక్షణకును
బతివియోగపువాక్యమే మృతిగఁ దోఁచె

గీ. అతివ మనమును గనుఁగొని యాతఁ డపుడు
చాసఁ గౌఁగిటఁ జేరిచి జాలువాఱు
కనులనీ రుత్తరీయంబుకడలనొత్తి
మురువుఁబల్కుల నెంతెంతొ బుజ్జగించి

గీ. చెక్కుటద్దంబులను జిఱుచెమట ముత్తి
యములు గుము లయ్యె నేటికే? విమలవదన!
చిన్నిమురిపెంపు నెమ్మోము చెన్నుదఱిఁగి
చిన్నవోవఁగ నేటికే? చెలువమిన్న!

గీ. రమణి! విపరీతభావాంకురములు మొలక
లెత్తెనే? నీహృదయసీమ, నింతదనుక
రాణఁ బొలిచిన మన యనురాగసస్య
మంతరింపఁగ నాతి! దుర్దాంత రీతి.

గీ. వేడ్కఁ దనయంత విచ్చి పవిత్రమైన
ప్రణయసుమము సుఖసుగంధబంధురంబ
గాని, విపరీతపరిణామకలనఁ గాదు
దుస్సహావిషాద దుర్గంధ దూషితంబు

గీ. తరుణి! యేటికి మది నన్యథాకరింపఁ
దగదు, తగదు, ప్రకృతివిరుద్ధంపుఁ దలఁపు
ఒక్క పువ్వు పూచి దాన నేటొక్క ఫలము
పొడము టెందేనిఁ గలదఁటే పూవుఁబోఁడి

గీ. ఏల భయపడ భయపడనేల యనుచు
నెంతో బతిమాలు కాంతున కింతి, కంఠ
గద్గదిక చేతనో మేని కంపముననో
గొనసఁగఁ జాలకపోయెఁ బ్రత్యుత్తరంబు

గీ. అనుపమప్రేమసూత్రబంధనము చేత
నతఁడు నా కన్నె దంపతులైరి గాని
నామమాత్రము సూత్రబంధనముచేత
బద్ధులయి కూడు బడుగుదంపతులు గారు

గీ. వలపుఁ జనవున నెనయు దాంపత్య మరయఁ
దావులకుఁ దావలంబయి తనరు సుమము
బహుళనిర్బంధఘటితదాంపత్యవిభవ
సరణి నిర్గంధనిస్సారజతుసుమంబు

గీ. తావి గల పూవునకుఁ జక్కదనము లేదు
చక్క నగు పూవునకుఁ దావిసరకు లేదు
తావియును జక్కదన మున్న పూవొకండు
పాకమినను నిరపాయమై పొలుచు టరుదు

గీ. చాలకోమల లీల రసాలకాండ
మొరసికొని ప్రాఁకు చున్నది యొక్క లతిక
ఊహసేయఁగలేము మనోహరంపుఁ
బూలుపూచునో, నడుమనే పాలియునేమొ

గీ. సారతరుసంశ్రయణసుఖ మూరఁ గల్గె
ననుచుఁ బొంగుచు నున్నది యల్ల లతిక
అవల నా కుజమే తన యంతమునకు
హేతు వగు నేమొ భావ్యర్థ మెవ్వఁ డెఱుఁగు

ఆ. కాలవశతఁ జేసి యాలత కాయువు
తీఱ నేనిఁ బిదప నా రసాల
కుజమిఁ కేటికి వనకుంజపుంజము నందు
నిలిచి యుండ నిలువునీఱు గాక

గీ. ప్రియలతఁ బెడఁబాయుట వితతదుఃఖ
మగ్నమానస మగు మావిమ్రాకు పట్ల
నకట! అది యేమొకో వనపాలకుని చేతి
కఱకు గొడ్డలికిని రాదు కనికరంబు

గీ. పూర్వకృత పుణ్యలతికలు పూలు పూచి
ప్రేమదంపతు లయిరి యా పిన్న వారు
విరస దురదృష్టవాయువు వీచి మల్ప
కున్నఁ దత్సుమములఁ దావు లొదవఁ గలవు.

గీ. ముగ్ధత యదెంతచేసెనే ముద్దుగుమ్మ
భావ మెఱుఁగక యిటు జాలిపడియె దేల?
అనుచు నాతఁడు ప్రియసతి ననునయించె
ముద్దుచెక్కిళ్ల నిమురుచు ముద్దుగొనుచు

ఉ. మల్లిక ధైర్యమంది, పతిమన్ననలంతకునంత సమ్మదా
భ్యుల్లసనంబొసంగఁ దెలివొంది “మనోహర! మిమ్ముబాయనే
నొల్ల వచింపఁ బోకుఁడిటులొప్పని పల్కులనింక మీఁద, మీ
కెల్లిదమై కనంబడెనె యిట్టి విషాదకరప్రసంగముల్

గి. ఇంపుగులుకఁ బ్రేమోపాస్న మొనసి బలసి
పడుగు పేకలుగా నల్లు వాఱుచున్న
కోర్కి వల్లికలను దెగఁగోయఁ బరుష
వాగ్లవిత్రములకు నేల పదును వెట్ట?

గీ. నట్టనడిసంద్రముననున్న నావికునకు
నావ ప్రిదిలెడునను భీతిభాసమునకుఁ
దట్టెనేనియు గుండియల్ దద్దరిలవె!
అకట! జీవితాశాదీపమాఱిపోవ

గీ. చిరతరామయ శిధిలుఁడై చివికి చిలికి
నవియు రోగి కరంబుఁ గ్రన్నన స్పృశించి
వైజ్జు నిర్దయ విఱిచెడి పెదవి విఱుపు
నాథ! సద్యోమృతికిఁ గారణంబు కాదె?

గీ. నాథ! అతిసుకుమారమనస్సుమంబు
మంజులాలాపశీతల మందమారు
తమున కోర్చును గాని, దుస్తరకఠోర
వాక్యఝంఝామరుద్ధాటి బ్రదుకఁగలదె?

చ. అనివచియించునాయువతినాచతురుండుమృదుప్రసంగగుం
భన సరసానులాప విభవ ప్రభవాతత మోదమగ్నచి
త్తను బొనరింప,సంశయము తక్కఁగసాక్కినమాససంక్ర
న్నన గడిదేఁటనారమణినాథునిఁ దేల్చెను మురువొజెయ్యువలెన్

వ. అంత నవ్వసంతుండు

గీ. అలనభోమణియను దివ్వెమలిగి పోవ
డంబలరఁ గ్రమ్ము ధూమ పుంజంబనంగ
నలమఁ దోడఁగెను దమము దిగంతరములఁ
సకియ! మనకింటి కేఁగఁగ సమయమయ్యె

వ. అనుచుఁ బయనంబుకానున్న వారలకునమస్కరించి
యవ్వనపాలకుల నొకండు.

గీ. పండిపండని తెలి జేమపండ్లు కొన్ని
పండి పగిలిన దానిమ్మ పండ్లుకొన్ని
ఎండి యెండక తగు ద్రాక్ష పండ్లుకొన్ని
దోఁయిఁటను మల్లికావసంతుల కొసంగె

వ. మఱియొకచో.

గీ. బొండుమల్లెల గుత్తులు పొగడ పూల
దండలును మల్లికాసుమ స్తబకములును
మొగిలి చెండ్లును దవనంబు మొల్ల మొగ్గ
లెలమిమై మల్లికా వసంతుల కొసంగె

క. ఫలములు సుమములు గైకొని
లలనయు నా లలితగుణుఁ డలఘుమోదము చి
ప్పిల నింటి కేఁగుటయు ది
గ్వలయంబుల బలసి వెలసె బలితంపు టిరుల్

గీ. యామినీపృథుశుక్తిగర్భాంతరమున
వేన వేలకు మిగిలి యావిర్భవించెఁ
దారకామూల్యజాతిముక్తాఫలములు
ప్రబల కాంతు లజాండకర్పరము నిండ

గీ. తరులు గిరులని యనక సాంతముగ జగముఁ
జెనకి ప్రింగెడు చీఁకటి శిరముఁదన్ని
వెలుఁగఁ దొడఁగెను దారకల్ - కలరు త్రాడు
నెక్కువారల తలఁదన్ను నుక్కడీండ్రు.

గీ కంటికాగని తారకా గణము మీఁదఁ
గాలు ద్రవ్వెస తమము చీకాకునందె
సల కలానిధిఁ గాంచి గోడలను, గొందు
లనెటొడాగె సపండితు లక్షణమున.

గీ. నిగిడి బ్రహ్మాండ భాండంబు నిండిపొంగి
కెరలు గాఢాంధతమసపంకిలజలంబు
అంతలోఁ దేటుఁగొని తేటయయ్యె శిశిర
కరకతకబీజసంస్పర్శకారణమున.

క. మల్లికయు వసంతుఁడు ను
ద్వల్లిలఁ జలకమాడి తత్త్రిక్రియలం
దుల్లం బుల్లాసమునఁ
వెల్లిగొన భుజించి పిదప వేడుకలలరఁ.

సీ. ప్రేమ వాక్యంబుల పెంపుసింపెసలారఁ
జల్లనిగాలిఁ బచారుసల్పి
జంత్రగాత్రమ్ములు జతకూర్చి తమిఁగూర్చు
సనురాగమునసరాగ మాలపించి

మాటపై మాటగాఁ బోటి పందెమ్మువైచి
యలయక తూఁగుటుయ్యాలలూఁగి
కప్రంపుఁ బల్కుల కమ్మతావులను గ
మ్మనఁబొల్చు మంచి తమ్ములముసేసి

గీ. తనువు పులకింప మంచి గంధంబులలఁది
పరువు టలరుల నొఱపైన పఱపు శయ్య
పైఁ సుఖించిరి రేయెల్ల బహువిధగతులఁ
బండువెన్నెల బయఁట నాపడుచువారు

గీ. దిక్తటమ్ములొరసి కౌముదీరసంబు
నింగికిని బొంగు వాఱుచు నిండియుండ
శాంతనిశ్శబ్దతాస్ఫూర్తిఁ జాలఁదనరి
ఆ నిశీథంబు నిస్తరంగాబ్ధిఁ బోలె

గీ. మనుజపశుపక్షికంఠనిస్వనము సడియు
సన్నయునులేని యన్నిశా సమయమొప్పెఁ
గామరోషాది విషయ వికార రహిత
మౌ మహాత్ముని సన్మన సీమవోలె.

# ప్ర ణ య కు సు మ ము

## ద్వి తీ య ద ళ ము

గీ. కుక్కుటమ్ముల కొక్కొరోకోస్వనంబు
కన్నమున్నుగ విప్రగృహాంగణముల
నుదితమై వరలెను "హరిః ఓమ్" అటన్న
ప్రణవనాదంబు కర్ణపర్వంబుగాఁగ.

గీ. ఉదయదర్కుని వైభవాభ్యుదయ మెంచి
సరసిజాగారసుప్తోత్థచంచరీక
బాలికలు పాడుచున్నారు మేలుకొలుపు
కవికుమారుల డెందముల్ కందళింప.

గీ. ఎంత చర్చించినను నుంత యెఱుక పడని
భావగర్భితవాక్యసంభాషణములఁ
బులుఁగుదంపతు లేమేమొ ముచ్చటలను
జేయుచున్నారు సృష్టివైచిత్ర్యమేమొ.

గీ. నీటి కెద్దడి యూటచే నీలవేణు
లొకరి కంటను మున్నుగా నొకరు పరువ
లెత్తుచున్నారు బావికి ముత్తములుగఁ
గాళ్ల కడియంబు లందియల్ కదలిపోయె.

గీ. "ఆ" యనిన "నూ" యనిన నేడ్చి యూఁగడమునఁ
బరువుఁ బోనాడు గయ్యాళి భార్యయట్లు
తాఁకి తాఁకక ముందె డెందంబు కలఁగ
వాఁగుచున్నది చేదుడు బావిగిలక.

గీ. తెల్లవాఱఁగ నయ్యె నీ పల్లెవోస్థి
యింతకును నిద్రమేల్కొనదే మొనేఁడు
వింతయంచుఁ దలంచి వసంతుఁ డంతఁ
గరముచే స్పృశియించె నా కలికి యొడలు.

గీ. ఇనకరస్పర్శచే మేలుకనెడు కమలి
నీసతియు పోలె మల్లికా నీలవేణి
ఇనకరస్పర్శచే మేలుకనియెఁగాని
కన్నెమొగమేమొ యొకక్రొత్తకళ వహించె

క. "నాకన్న మున్నె మేల్కనె
దో కలికీ దిన మదేమొకో యీనాఁడీ
వీ కరణి నింతప్రొద్దగు
దాఁకన్ని దురించుచున్నదానవు లెమ్మా."

గీ. అనుచుఁబల్కెడు పతి నా యుయారి కనుల
నెత్తిచూచెనుగాని ప్రత్యుత్తరంబు
నొసఁగ లేదయ్యె, మఱలనా యువిదమూసెఁ
గనుల ; నాతఁడు నిదుర మత్తని తలంచి

వ. అహర్ముఖోచిత కృత్యంబులకుఁజనుటయు.

సీ. పతిదర్శనాపేక్షఁ బాఱెడు కల్లోల
వతులకు బలుహొయల్ వరలఁజేసి
లలిత కోరక కిసాలయ వితానములకు
జిలుగుఁజాయలతళ్తళ్లమర్చి
తరుణాతారళ శాద్వలసీమలకు వింత
పొలుపార నపరంజిపూఁతఁ బూసి
లీలాగతిఁదమోమలీమస బ్రహ్మాండ
భాండంబు పరిశుద్ధి భద్రపఱచి

గీ. తన్ను—దోలూక విశతికిఁ దక్కు—తక్కు—
ప్రాణి సంతానమునకు సంబరము పొదల
విన్ను నకు వన్నె హెచ్చఁగ వెడలెఁ బొమ్ముఁ
గొండతల నుండి నూనూఁగు కొదమ యెండ.

గీ. బంగరుం దళ్కు— లే యెండ పరిసరస్థి
తావనీజాతమృదుపల్లవాంతరముల
నుండి మెయిఁ బ్రాఁకి యంతంత గండుమీఱి
పంత మూనిన గతి గిలిగింతఁ బెట్ట.

చ. కను లరమోడ్చి శయ్యనటు కమ్మఁబరుండిన కాంతకొంత నే
పునకుఁ దటాల్న లేచి మొగమున్న యనంబులుఁ బుల్మికొంచు
నె। మ్మనమున-నేమి యీలిదురమత్తు? పరుంటివె యింత
ప్రొద్దుదాఁ। క ననుచు నొయ్యనొయ్యఁగరకంకణనిక్వణమే
దురంబుగన్.

సీ. చెల్లాచెదరు గాఁగఁ జెదరిన యట్టి ముం
గురు లడంగఁగఁ గొనగోళ్ల దువ్వి
వలపు కార్యంబుల పట్ల రాతిరి బిగి
సడలిన జడ నుంత చక్క—పఱిచి

ననవిల్తు కయ్యంపుఁ బని యడావడిఁ జిక్కు
పడిన హారంబులు పదిలపఱచి
కరఁగి మొగంబెల్లఁ గ్రమ్మిన కస్తురి
బొట్టు కడిగి క్రొత్త బొట్టుఁ బెట్టి

గీ. చారు లోచనయుగ్గళిఁ గజ్జలముఁ దీర్చి
కోరి తీసిన జిలుగంచుకోకఁ గట్టి
మెలత మితభూషితాంగియై మేడమీఁద
నున్న పతిపజ్జఁ జేరి తా నున్న వేళ

చ. ప్రణయమెలర్ప నిర్వురుఁ బరస్పరవాక్చతురత్వవిత్తవై
పుణి రవణింప మేరసరసపుంబలుకుల్ పచరించుచుట్టునన్
గుణివరుఁ డవ్వసంతుఁడను-గోమలి! యంతటి నిద్ర కేమికా
రణమొకో? తట్టి లేప నొక రాణఁగనంబడితేమి హేతువో.

క. అను పతి కను సతి యనుగతి
మనవి వినుము నాథ! చెప్ప మఱచితి మీతోఁ
గన నయ్యె నొక్క కల యది
వినిపించుటకును మనంబు వెతసందుఁ జుఁడీ

గీ. రత్నములకెల్ల నాయకరత్న మగుచుఁ
దమకుఁ బ్రేముడి రత్నమై తనరు నొక్క
యామలకమంతరత్నంబు హస్తయుగళిఁ
గొంటి రాడించి యాడించి యంటి రిట్లు.

మ. అబలారత్నమవీవునాపయినమూల్యంబైన యీరత్నముల్
ప్రబలామోదదవస్తువుల్ ప్రియపదార్థంబుల్ సదా నాకటం
చు బహూక్తిస్తితిమెచ్చికోల్వలికి-మించుంబోఁడియీరత్నమి
త్తుబళా! నల్ జతురంగఖేలనమునందుల్ గ్రిందుగావించినల్

వ. అనుచుఁ జతురంగబలంబులఁ గట్టాయితంబు సేయ
నొండొరుల గెలుపుటాస మోసులెత్త నెత్తులు సడుపుచు
నొక్కచో నుత్తలపడుచు మఱొక్కచో మదికి ధైర్యంబు
హత్తించుచు పిఱుతివియక యిరువురము ముమ్మరమ్ముగ
ఖేలనలాలసమానసులమయి యాడుచుండ నే నెట్టకేలకు.

గీ. మాఱుమూలసఁ గాపున్న మంత్రివరుని
గీటడంచుచు- తెలిచిరా, జాటకట్టు-
అనుచు నాట ముగింపఁగ నంతఁ జింత
చేసి యీరీతి నానతిచ్చితిరి మీరు.

గీ. నాతి!యీరత్నమును గూర్చి నాదు మదికి
సంశయంబొండు గల్గె నా జాడఁ దగిలి
యాట నోటమిఁ గంటి నం చంతిలోన
నేను-తెల్పుఁడి సంశయం బేమి-యనఁగ

క. ఈ రత్న ధళధళద్యుతు
లీరంగులును పయితళుకులేనా తగ నీ
తీరున లోననుఁ గలవా
ఆరయవలె నన్ను కోర్కె యాత్మ జనించెఁ"

గీ. అనుచు మీారన్న పల్కుల కల్లన నగి
నన్ను వెఱ్ఱిగఁ దలఁచి యీ పన్నుగడను
బన్నితిరో? రత్న మీాకన్న వదల నంటి
నవ్వు కాదు పరీక్షింతు నాతి ! యనుచు

గీ. అక్కె రయొక చూపుఁ జూచితి రంతలోన
మూర్ఖభావంబు తోఁచె మీా మొగము నందు
హృదయ మను పుస్తకంబున కెన్న మొగము
విషయసూచిక యగుఁ గాదె విజ్ఞులకును.

ఉ. ఎన్నఁడులేని మూర్ఖమతి యెట్టులఁగల్గెనో యేమొకాని నే
నెన్నివిధాల వేఁడిన మఱెన్నివిధంబుల నడ్డు సాచ్చినన్
నన్నొకలెక్కఁ గుంగొనక నాదృతిసేయుచునట్టి రత్నముం
గ్రన్ననఁ గేలనూని యొక రాతికి రెట్టకొలంది కొట్టినన్.

గీ. తత్క్షణం బది భయదశబ్దంబు తోడ
ఖండ ఖండము లగుచు నల్గడలఁ జెదరె
గనులు మిఱుమిట్లుగొనఁ దళతళ్కాంతు లొలయ
నేల విషమ పరీక్ష యం చేనుపొగుల.

ఉ. పిదప నమూల్యరత్న మవివేకత నాశముఁ జేసికొంటి బె
ట్టిదపు టకృత్య మిట్టులఁ గడిందినొనర్చితిఁ జెట్టపుట్టె నె
య్యదియిఁక నాకుదిక్కనుచు నంతకునంతకు దుఃఖముబ్బ
మీరదవదలై తిరప్పుహృదయంబొగసోలిపొకాలితూలఁగన్

క. "నాప్రాణప్రియరత్నము
నాప్రాగ్జనిపుణ్యఫలము నా భాగ్య మయో
నా ప్రాణముఁ గోల్పోయితి
హాప్రియ యిఁక నాకుఁ గలదె యవనీస్థలిపై".

క. అని పలువిధములఁ బలుమఱుఁ
గనువారల గుండె పగులఁగా బహుదుఃఖం
బున శిరము మోదికొంటిరి
కనుఁగవ జల మూరియూరి కాల్వలుగట్టన్

గీ. అట్టి మిమ్ముఁ గనులను జూచు సప్న డేను
భ్రమానుపడి నిల్చితిని శిలాప్రతిమ వోలె
నంతలోఁ దట్టి లేపితి రాబెడంద
తత్తరంబున మేల్కంటి మత్తుగదిరి.

క. వేకువఁ దోఁచిన యీ కల
వ్యాకులతం జెంది మనము ప్రాణేశ్వర ! చీ
కా కయ్యె దీన నే మగు
నో,కీడో,మేలో,యనుచు నురిఁ బడ్డతితిన్

వ. అననవ్వసంతుండు.

చ. కల యనఁ గల్ల యందులకుఁగా మదిచేడ్పడఁగుందనేటికిన్
గలలు నిజంబులైన నలకాపతి తానయినట్లు, స్వర్గవీ
థులఁజరియించినట్లును బృథుప్రభుతన్ గనినట్లు, స్వప్నవృ
త్తులఁ గనువారలెల్లఱునుతో య్యాలి!కాంచిరెత త్తదర్థముల్

క. చెఱకుల చెట్ట పోసర్పదు
కఱు మేలుగఁ దోఁచు స్వప్నగాథలు తగు మే
లోడఁగూర్పఁ జాల వేటికిఁ
బడఁతీ! కలలోని పొల్లువార్తల కలుకన్

చ. తనతలనొక్క చెట్టుకొనఁద్రాటను వ్రేలగ గట్టిఁయంతటన్
బనిపడి వేఱయుండెడకుఁ బాడములంబయి కెత్తి, కేలుఁదో
యిని నడయాడినట్లు, పయి నేదియొరీతిగఁ దోఁచు స్వప్నవ
ర్తనమున కర్థమొందుకలదా? తలఁపన్ వలదా? తలోదరీ.

గీ. వికలహృదయుండు కూసెడి వెఱ్ఱి మొఱ్ఱి
వెడగుఁ గూఁతలకును, స్వప్నవృత్తులందుఁ
గల్పితము లగు విపరీతగాథలకును
అంతముండునె ? వికచసితాబ్జనయన !

గీ. ఆకులత యేటి కా కల పోకడలకు
నీకలవిధంబు మదికి రానీకు మింక
లలన ! కలతవడం బని కలుగ దిందు
వితగ వెతసంద నేటికే వెఱ్ఱిదాన!

క. దిట్టవనుకొంటి నయ్యో
వట్టి పితికి వేమె యనుచు వనితామణికిన్
నెట్టన ధైర్యముఁ జెప్పుచు
పట్టున వినవచ్చె బహుళవాద్యారవముల్

క. ఆ వ్యాజంబునఁ బడఁతిమ
నోవాక్యులతను సడంప నూల్కొని యాంతం
డవ్యక్తమధురగళనిన
దవ్యాహారమున నిట్లు తనసతి కనియెన్

క. పెండిలి యూరేగింపో
యొండొక శుభకార్యవిభవమో కాని మహో
ద్దండత వాద్యస్వనములు
మెండుకొనన్ బయలువెడలె మెలఁతరో! వింటే

మ. చనుదెంచెన్ మనవీథికుత్సవ మిదే చానా! కనుంగొంటివే య
నుచున్ సుందరిఁ గూడియాతఁడును జాలాంతఃప్రవిష్టాస్యుఁ
డై । కనుచుండంగ నొకింతదూరమున గేకల్ జోక లేకంబు
గా । విననయ్యెన్ బహుళభారశోకవివశావేశాతిఘోరంబుగన్

సీ. పొగిలి దుఃఖంబును దిగఁ ద్రావి మదిఁ గుందు
బందుగుల్ కొందఱు ముందు నడువఁ
గంటికిఁ గడవెడుగాఁగ వాపోవుచుఁ
బిన్నవాండ్రార్తిమై వెంబడింప
నడుగడుగునకును శూద్రాంగన లంత్యజులం
టగ వారివోసి దండములు వెట్ట
నొకరివెంబడి నొక్క రొకరుగా ముత్తైదు
వలు భక్తిఁ బుష్పాంజలుల నొసంగ

గీ. నెలమి నింటింట నిలిచి గేహిను లొసంగు
పసపు, కుంకుమ, గంధంబు, పండ్లు, గొనుచు
నడుగు లిడుచుండె మెలమెల్ల నబలయొర్తు
శోకమయమగు నా జనస్తోమమందు.

గీ. పసపుకోకనుగట్టి, నెన్నొసటఁ బసపు
బూసికొని, పెద్ద కుంకుమబొట్టు వెట్టి
వీఁదులనుదాటఁ దడితల విరియఁబోసి
నయనముల శోకరస మొల్క నడచుచున్న
పేరఁటాలికి మ్రొక్కిరి పౌరులెల్ల.

గీ. సకియ, కామెను జూపి వసంతుఁ డనియెఁ
దన్ను విడి చన్న పతియెడ దనకుఁగల్గు
భక్తియును బ్రేమ బ్రేరింప వనిత యతని
ననుగమించుచు నున్నది యమలచరిత.

గీ. భర్తయెడ నిజమగు బ్రేమపరతఁ గన్న
నెలఁత యాతని బెడఁబాసి నిలువఁగలదె?
పడఁతి! యీసతి తగుఁ బతివ్రత యనంగఁ
గానిచోఁ బూనునే సహగమనదీక్ష.

గీ. పదుగురును మెచ్చుకొనఁ బతివ్రతలు పోలె
నిక్కి నటియించు టక్కరి టెక్కులాడు
లెందరైనను ముదిత! యీ యింతిఁబోలఁ
గలరె? పూనుదురే సహగమనదీక్ష?

సీ. ఆత్మేశు సంశయం బపనయింపఁగఁ జిచ్చు
దూరిన సీతావధూటి కన్న
మృతిగన్న పతికిఁగా నెదిరించి జమునితోఁ
వివదించి నట్టి సావిత్రి కన్నఁ

బతి యంధుఁ డగుటచేఁ బతియట్ల తాను నం
ధతను గైకొన్న గాంధారి కన్నఁ
బతులతోఁ బాటు విస్తృతకష్టముల కోర్చి
చాల పేర్గన్న పాంచాలి కన్న

గీ. మిన్న యని చెప్పఁదగు నీయన్నుమిన్న
మానవాంగనలందు నీ మహితచరితఁ
బోలఁ గలవారు కలరె! యీ కాలమందు
నతివ యెంతటి వరపతివ్రతయొ కాని.

క. అని మెచ్చెడు పతి కిట్లని
యెను మల్లిక-జగతి సాధ్వియే కడఁ గలదో
కననౌనె? యేల పూర్వపు
ఘనసాధ్వులతోడఁ బోల్పఁగా నీ సుదతిన్

గీ. నిక్కముగ భర్తఁ బ్రేమించు నెలఁత యేని
అచ్చెరువుగాఁగ నీబిడ-చచ్చెనాథుఁ
డను పలుకు విని యెట్టులీ యాటలాడు
నయ్యయో సహగమనశబ్దార్థ మేమొ.

గీ. ఘుములుఘుములుగ బందుగుల్ గోడుఁజెంద
దరికొనెడు మంట నార్తశబ్దములతోడఁ
బగ్గ కెట్టులో ప్రాణముల్ బిగ్గబట్టి
కాట ప్రగ్గుటయో సహగమన మనఁగ.

గీ. ప్రజ్వలించిన విరహాగ్ని ప్రగ్గిపోక
పగ్గ కే నిడె యగ్గిని బడుదు ననుచు
సాహసంబును బూను వేసాలమారి
బడుగు తనపతిఁ బ్రేమించు పడఁతి యగునె.

గీ. భర్తయుడ భర్తఁ బచరించు పడఁతుకతును
మగని ననుసారఁ బ్రేమించు మానినికిని
హా స్త్రీమశకాంతరమనుసుఁడీ యరసి చూడ
స్థూలబుద్ధికి దుర్జ్ఞేయ సూక్ష్మ మిద్దె.

గీ. ప్రేమ క్రూరాహి మెడఁ దాల్ప భీతిఁ గనదు
సంద్రములు దాట జంకదు, శైలవాస
కలన కలుకదు, శృంఖలఁ గట్టువడదు
ప్రేమతత్త్వంబనుభవైకవేద్యమనఘ!

గీ. ప్రేమ కల మేరు వొక్కఁబుష్ప పెద్దదిబ్బ
వల్లకాడైన బంగారు పంటభూమి
వనముస్వర్గంబు స్వర్గంబు వల్లకాడు
తలఁచిచూడఁగఁ బ్రేమతత్త్వమ్ము వింత.

గీ. కొంతగా నెంచఁబోదు తాఁ గొఱుతఁబట్టఁ
గంటగింపదు దరికొను మంట దుముక
ప్రాణ మనఁ బ్రేమ కొక తృణప్రాయ మహహ
ప్రేమతత్త్వంబు మాటల వేద్యమగునె?

గీ. చెండి చెరలాడు గండ్రగొడ్డండ్లైన
వెల్లిగొని పాఱు నెత్తురు టేర్లైన
కంపుఁగొట్టెడు మాంసంపుఁగొంపినైనఁ
బ్రేమ, యానందమయభావవిభవమందు.

తే. మనుజులకె కాదు ప్రేమసంబంధసుఖము
ప్రేమబద్ధంబు జగమెల్ల, ప్రేమచక్ర
మాదరువు ఛేసికొని సాగు ననవరతముఁ
బథముఁదప్పక పృథులప్రపంచరథము.

గీ. సంజఁ బ్రియుఁబాసి శోకించు చక్రవాకి
తియ్యని యెలుంగునం దోఁచు తేట పలుకు
లయ్యయో నాథ ! ప్రేమతత్త్వార్థబోధ
సూత్రములుగావె ? మృదుమనస్కులకుఁ దలఁప.

గీ. అకట! తన నిల్వరింపు తామసకము చెడిన
మీఁద నిలుచునె తుదకు నిమేష మేనిఁ
బ్రేమలత వాడిపోవక ప్రేంఖవలకుఁ
దమకుఁ జెప్పఁగ నేర్చిన దాన నొకొ్క.

గీ. అనుచుఁబ్రణయంపుసరణివాక్యములఁబలుకు
కలికి మనముఁ "బరీక్షింతుఁ గాక" యనుచుఁ
దలఁచి యతఁ డనెఁజెలువకో తలిరుబోఁడి
నీవు పల్కిన పల్కులు నిక్కవములె.

గీ. కాని యీకాలమందలి కామినులను
బతిఁబ్రిశుద్ధిగఁబ్రేమించుసతియుఁగలదె
జలధివలయితమేదినీతలము నందుఁ
బలుక వచ్చును గా కను పతికి మ్రొక్కి.

గీ. మల్లికాతన్వి "నాథ! నా మనవి వినుఁడి
అట్టి సతి లేదులేదని యనఁగఁ దగదు.
కాంచఁగల్గిన నెందఱో కలరు నేఁడుఁ
బరమసాధ్వులు విశ్వప్రపంచమునను.

గీ. జగతిఁ గులటలఁ గలసియే సాధ్వు లుంద్రు
నత్తలను గూడి జలధిరత్నమ్ము లట్లు
ప్రాజ్ఞులు రహస్య మెఱిఁగి వేర్పఱుపఁ గలరు
తెలియ నట్టుల సూరు వాదింత్రుగాని."

ఉ. కాంతమనంబునంతఁ గనుగందఁగనిక మ్మృదూక్తియుక్తులన్
గాంతుఁడు పుల్మిపుచ్చె "లలనా! యిపుడిప్పువచించినట్టివృత్తాం
తము, ప్రేమతత్త్వము, నితాంతము స్వాంతముఁ దన్పె మేలు మే
లింతటితత్త్వవేత్త్రి వని యే నెఱుఁగంజుమి" యంచు వంచనన్

———

# ప్రణయకుసుమము

---

## తృతీయదళము.

గీ. పిదప నా ప్రేమదంపతుల్ వివిధవిభవ
సంపదల పెంపు సొంపార సకలసుఖము
లనుభవించుచు నిరుపమాన్యోన్యమైత్రిఁ
గాఁపురము సేయుచుండి రకలుషఫణితి.

చ. పతిమనసుం గ్రహించి తగువర్తన నాతనిఁ దృప్తిఁ జేయు న
య్యతివ;అతండు నా సుదతియాత్మపథంబు విధంబెఱింగి న
మ్మతిననుకూలుఁడై మెలఁగు;మాయురె!యొద్దికయింతయొ
ప్పిదం! పతు లిఁకనెవ్వరంచుఁ దమబంధుగులుం బెరవారు
మెచ్చఁగన్.

క. మల్లిక సద్గుణవల్లిక
లల్లుకొనె న్నాల్గుకడల నత్యుచ్ఛగతిన్
బెల్లుగ యువతీజనమ
తల్లిక యను కీర్తి పూచి తావులుచల్లన్.

గీ. వయసుసంబిన్న యయ్యు నా వనరుహాక్షి
పరువు, మర్యాద, గురువు, దైవంబు, పెద్ద,
పిన్న, పుణ్యంబు, పాపమంచెన్న నేర్పు
వరల వర్తిల్లెఁ దను బతివ్రతలు పొగడ.

క. గౌరీపంచాక్షరి భ
క్త్యారూఢి జపింపకుండ నా పైని ముదం
బారఁ దులసిఁ బూజింపక
యా రామ భుజింప దలసియైన నొకప్డున్.

గీ. మగని కనవరతమ్ము సేమమ్ముఁ గోరి
ప్రమదమునఁ బుత్రసంతానవాంఛఁజేసి
అతులితోన్నతభోగభాగ్యములఁదలఁచి
ఆమృగనేత్రదినమొక్క నోమునోము.

సీ. బహువిధఫలపరంపర లైదువల కిచ్చి
పడఁతి నోఁచెఁ బదాఱుపండ్లనోము
మున్నూట యిరువదిమూడు వాయనముల
నాతి యర్పించె గండాలగౌరి

యుద్యాపనముఁ జేసె యువతీలలామంబు
ప్రాభవంబున లక్షపసపునోము
వేడుకమెయి యథావిధిగఁ బూరితిసేయఁ
గోమలి సావిత్రినోముఁ బట్టెఁ

గీ. బెక్కు ముత్తైదువలకుఁ దాఁ బెక్కుమార్లు
చీరలును రైక లిచ్చి యాశీస్సులందెఁ
బతియుఁ దనవర్తన కెద సంబరము నందఁ
గ్రమతరభంగి నా మల్లికాసుమాంగి.

ఉ. భామిని యొక్కనాఁడు తెలవాఱిన శ్రావణశుక్రవారమం
చా మెయి నాఁటిరాత్రికె సమస్తపదార్థము సంతరించి, శో
భా మహితంబుగాఁ గబహుభంగుల గేహమలంకరించెఁ దా
నోముకొనంగ? నంగన తనూలత నూతనరీతి ద్యోతిలన్.

గీ. నాఁటి వేకువ నభ్యంజనం బొనర్చి
గోమయమున నల తులసికోట యలికె
రంగురంగుల ముగ్గుల రకరకముల
రంగవల్లికలను దీర్చె రంగుమీఱ.

గీ. కాంత నెఱికురులను గీలుగింటమర్చి
చేల పూచినగతి భూషణాళి దాల్చి
కరమునను బెద్ద కుంకుమబరణిఁ బూని
బయలువెడలెను ముత్తైదువలకుఁ జెప్ప.

గీ. పొలఁతి పురమునఁ గల విప్రపుణ్యసతుల
నెల్లరను బిల్చె—తమ యింటి కేఁగుదెంచు
నా విశాలాక్షిఁ గాంచి ప్రత్యక్షలక్ష్మి
యింటి కరుదెంచె ననుకొందు రెల్ల సతులు.

గీ. "ప్రొద్దు ప్రొద్దున లేచి యీ ముద్దుగుమ్మ
మోముఁ జూచినఁ బాతకంబులు నశించు"
ననుచుఁ గొనియాడుదురు పౌరు లాసుశీలఁ
బొలఁతిఁ గైకొన్నవాఁ డెంత పుణ్యతముఁడొ!

గీ. శాంతరసమొల్కు ముదితయాస్యంబుఁ గన్నఁ
గరుణఁజిప్పిలుసతికటాక్షములు గన్న
నమృతమునుజిల్కుకొమ్మవాక్యములు విన్న
మూర్ఖునకు నైన మ్రొక్కఁగ బుద్ధిపుట్టు.

ఉ. మంగళవాద్యఘోషములమందముదావహరీతి మ్రోయఁబు
ణ్యాంగనలందఱొక్కమొగి హర్మ్యతలంబుల నలంకరింపఁ బే
ముం గలబందుగుల్ ముదితమానసులై యిలునిండియుండఁగ
న్నంగవఁ దన్వి దద్గృహమునూనవినూతనమోహనస్థితిన్

గీ. ఆ ప్రజనతాపరీతగృహాంగణమున
లీలఁ జరియించు మల్లికానీలచికుర
పద్మినీషండమండితభవ్యసరసి
హంస విహరించు క్రోధమరాయంచయనఁగ.

క. ఇది గో వచ్చెద నని చని
యిదివఱకును రాకపోయె నేమొకో యని యా
సుదతి మదిఁ గొందలంపడు
నెదురెదు రేచూచు, ధైర్య మెలమిం గాంచున్.

చ. ఒకపనిఁ జేయఁబోయి మఱియొక్కపనిం బొసరించుఁ దంద్రమై
నొకతెఁ దలంచి పిల్చు నిఁకనొక్కతె, వల్లనినోటఁ బల్కు వా
రక యిటురమ్మటంచును గరమ్మున సంజ్ఞ యొనర్చు మల్లికా
ప్రకటచరిత్ర, యంత నిజభర్తృసమర్పితచిత్తవృత్తియై.

గీ. ప్రొద్దు పోయెనటంచుఁ బురోహితుండు
తారసింపఁగ మగువమనోరథంబు
పతిసమాగమసంశయ పంకమగ్న
మయ్యెఁ జనె నోమునోఁచఁగనతులభక్తి.

ఉ. శ్రీరుచిరంపుఁ దోరణవిశేషములున్ మెఱుఁగారుముచ్చిబం
గారపుఁ జిత్రపుంబనులుఁ గమ్మని గేదఁగిపూవురేకు సిం
గారము సౌరు మేలనఁటికంబము లింపొనఁగూర్చ వైభవో
దారత నొప్పి యెంతయును హర్ష మొసంగెను పాలవెల్లికన్

గీ. కలశ మారాధనము చేసి యల సుశీల
పతి ప్రతిష్ఠించె నట శుక్రవారలక్ష్మి
నలుగడల దీపకళిక లుజ్జ్వలత వెలుఁగ
సరవి సాంబ్రాణి ధూపవాసనలు వొలయ

గీ. పరమ సౌభాగ్యలక్ష్మి శాశ్వతము గాఁగఁ
బూర్ణమతి మా కొసంగుమంభోజవాసి
నీ! జగన్మాత! యంచు నిర్నిద్రభక్తి
పరగఁ బూజించె సతి శుక్రవారలక్ష్మి.

గీ. ఆర్ద్రిమతి లక్ష్మి ప్రత్యక్ష మైనయట్లు
చిత్తమాయ త్తపఱచి పూజించుచుండెఁ
దత్పరతను గుణవతీమతల్లి మల్లి
కాంబ, మంగళమతిఁ బేరఁటాండ్రతోడ.

గీ. మల్లికాతన్వి లలితంపు మాటలందు
కన్నుసన్నల, నునుమోముచిన్నెలందుఁ
గాఁపురం బున్న దల లక్ష్మి; కలికి నిపుడు
చూడ నోఁచినవారలే సుకృతు లరయ.

గీ. మేదురాదరలలితలక్ష్మీకటాక్ష
పఙ్క్తి తాండవ మాడు నా భవ్యభవన
సీమ భోగంబు స్థిర మని చెప్పఁగలమొ
స్థిరత యేకడ గన్పట్టు? సృష్టిలోన.

ఉ. పల్లవకోరకప్రసవపక్వఫలాదులచేఁ బతత్రి వం
శోల్లస నైకహేతువు, మహోష్ణకరాతపతప్తపాంథసౌ
ఖ్యోల్లసనప్రదంబు నయి యొప్పు మహీజమొకప్డు వైభవం
బెల్ల నడంగ మ్రోడగుచు హీనతనందు, స్థిరంబెసంపదల్.

గీ. పుష్పవతులగు తీవియ ముద్దరాండ్ర
భ్రమరయువతులు చెనకెడు పట్టునఁ బిక
బాలికలు పాడు ముద్దుల వరుసపాట
లెల్లకాలము వినుభాగ్య మెట్లు గలుగు.

గీ. తటములకుఁ బుక్కిలింతలై చటులనినద
భాసురంబయి, సరసజీవనసమృద్ధి
వరలి కులికెడు పూర్ణస్రవంతి మంద
గమనసౌభాగ్య మెంతకాలము రహించు?

గీ. నిర్మలంబైన పండువెన్నెలలవిందు
బంతిపెట్టి చకోరదంపతులఁ దనుపు
సారశారదరాత్రులు శాశ్వతములె?
విశ్వవిభవంబులను లేదు శాశ్వతంబు.

గీ. నిలుకడలు లేవు లోకరీతులను, సతము
జగము కాలానుసారియై జరుగుచుండుఁ
గాలతీవ్రప్రవాహ మేకడల నెన్ని
వంకలుగఁ బాఱునో యదెవ్వం డెఱుంగు?

క. పతి సేమమె చింతించుచు
మతి కమలార్చనవిధానమగ్నత హేలా
వతి పదిలపఱచి, యేకా
గ్రతఁ జూపఱకనులవిందుగా నున్న తఱిన్.

క. పరతెంచెను భటుఁ డొక్కఁడు
మొఱవెట్టుచు, శోకనాదమునఁ బురజనముల్
వెఱగంది వెంట గుమ్ములై
పరువులువాఱంగఁ బరువుపరువున నటకున్.

క. తద్గతిఁ జనుదెంచియు గళ
గాద్గద్యము తోఁప మనము కలఁతపడంగన్
హృద్గతభావము నతఁడు స
ముద్గతి మొనరింపలేకయుండెన్ బెలుచన్.

ఆ. వె. అచటి వారలెల్లరాతని గనుఁగొని
విహ్వలాత్ములగుచు వెనుకముందు
తోఁప కొక్క మొగిని దొట్రిలు పలుకులఁ
జేరి యప్పుడు పృచ్ఛచేసిరిట్లు

ఉ. గుండెలు బెండువాఱి కలగుందువడఁగ విలపింపనేల? నె
వ్వండయినన్ నినుం జెనకిబాధలు పెట్టెనొ, లేక గేహమం
దొండొక కష్టపాటు బెగడొందఁగఁ జేసెనొ, కాక ముప్పువే
ఱొండుఘటిల్లెనో నుడువకుండ వగం బొగులంగ నేలరా?

క. అని పలువురు పలువిధములు
గను ఖలికెడు కలకలంబు గాఁకియ నెట్టన్
వనజాస్య మల్లికాసతి
యును బూజ ముగించి యచటికొయ్యన వచ్చెన్.

క. వచ్చిన యామెం గనుఁగొని
హెచ్చినదుఃఖమున హృదయ మెరియఁగ భటుఁడ
త్యుచ్చస్వరంబున నేడ్చుచు
నచ్చోనపదముల వ్రాలె నతిశోకమునన్.

గీ. భటహతాచోకనినదవిపాట్యమాన
మానసాంభోజ యగుచు సమ్మల్లికాంబ
వదనకళ మాఱిపోవఁగ వడకఁ దొడఁగె
వాతచాలితమల్లికావల్లి వోలె

ఉ. కొండొకకాల మట్టు లలికుంతల చింతఁ గలంగియుల్లు రా
కుంఠితమిన్నకుండె, నయనోత్పలయుగ్మమునిండిబాష్పము
ల్మెండుకొనంగ నంత నొకలీల మనంబును జిక్కఁబట్టి య
య్యండజయాన తద్భటున కాకులపాటునయంగనిట్లనెన్

ఉ. ఎందులకేగియుంటివి?హృదయేశ్వరుఁ డెక్కడనుండె?నయ్య
యో । డెందము వందురంగనుగడిందివిషాదకషాయితాత్మ
నీ । వెందుల కిట్టులేడ్చెద? విదేమిటఁ బుట్టిన దావహ్ని? మ
మ్మిందఱఁ గాల్చుచుండె వచియింపుము, యేమిటఁ గొంప
మున్గెనో.

గీ. భక్తిఁ బూజించితిని శుక్రవారలక్ష్మిఁ
దల్లి నాయెడ నేటికి దయతొలంగు
వలదు వల దేలవాపోవఁ గలనిజంబుఁ
దెల్పు మన భటుఁ డనె గుండె దిగ్గురనఁగ.

ఉ. అమ్మా! అయ్యయునేనునీపురవరప్రాంతోరుకాంతారమా
ర్గమ్ముంబట్టి సమీపపత్తనముఁ జేరంబోయి యందున్న కా
ర్యమ్ముల్ తీర్చి వెండివచ్చుతఱిదుర్దాంతోగ్రశార్దూలమొం
డమ్మార్గమ్మున కడ్డునిల్చె వివృతాస్యాత్యంతఘోరాకృతిన్

గీ. నిలిచిన బెబ్బులిం గనుఁగొన
నిలువున నీఱయ్యె మనము నిశ్చేష్టుఁడనై
నిలిచితి నట్లనె తురగము
నిలిచెన్ గాల్గదపలేక నిస్త్రాణపడుటన్

వ. అప్పుడు వెనుకకుం జననుం డడుగుఁ బెట్ట వలనుపడమి, ముహూర్తమాత్రంబు చింతించి, జడియకు మని నాకు ధైర్యంబు కలుగఁ బలికి వసంతకుమారకంఠీరవంబు సైంధవంబు డిగ్గనుఱికి, కరవాలం బొఱవెలికి ఝళిపించిహుంకరించి యా క్రూరసత్వంబు సన్నసేయక మా యొద్దారించి నిలిచిన నదియు బెదురుగొనక వాలం బల్లల్లనాడించుచు.

క. కొండలు మార్మ్రోగఁగ ను
ద్దండతఁ గసుగంపుమీఱి తతనిర్ఘాతో
చ్చండకఠోరార్భటి నది
గాండ్రించెన్ వనమృగాళి కలగుండుపడన్.

మ. బధిరీభూతదిగంతరాళ మగు తద్ధ్వానంపుఁ జేడ్పాటునన్
గుధరోపాంతనితాంతసాంద్రవిపినక్షోణిం జొరంబాఱెహ్వా
ద్వ్యథ నర్వంబు; ప్రభుండతంద్రభుజగర్వాఖర్వదుర్వారశౌ
ర్యధురోదాత్తత నిల్చె హస్తకరవాలానర్తనస్ఫూర్తితోన్.

క. వడవడ వణఁకుచు నేనొక
కడ నిలిచితి దాని బాఱిఁ గడవఁగ గతి గ
న్పడమినిఁ గడ కది నాపైఁ
బడఁ గడఁగఁగ భీతితొడరి పడితిన్ బుడమిన్.

క. నాపైఁ బడ నుంకించెడు
నా పులికిని మత్ప్రభుం డహంకృతి సడ్డం
బై పిఱుతివియక నిలిచినఁ
గోపంబున రేఁగి యద్ది గోళ్లన్ జీఱెన్.

ఉ. చీరిన లెక్కకుంగొనక చెచ్చెరఁ జిచ్చఱపిడ్గుపోలె దు
ర్వారవిరోధివారబలవారణమస్తకపాటనక్రియా
క్రూరకరాసిఁ ద్రిప్పచలక్రోల్పులిపైఁ గవిసెన్ గుమారకం
ఠీరవ మార్భటిం గనుల నిప్పక లొల్కఁగఁ దామ్రనేత్రుఁడై

ఆ. వె. పులికి రాచపులికిఁ బోరు ఘోరంబయ్యెఁ
గ్రూరనఖఖరాసిదారితోభ
యోరుదేహరుధిరధారార్ద్రపరిసర
భూమిభాగ మగుచు భీమపణితి.

క. అట్టులఁ బోరెడు పట్టునఁ
బట్టువదలి చేతి కత్తి పడిపోవ వెసఁ
బెట్టిద మగు వ్రేటునఁ బడఁ
గొట్టి మృగం బొడిసి తేని కుత్తుకఁ బట్టెన్

వ. పట్టియిట్టట్టుఁగొట్టుమిట్టాడనీక యా లలితదేహు గతాసుం జేసిపొదలమాటున కీడ్చుకొని పోయిన నేను హతాశుండ నై యిట్లువిలపించుచు నిలుసేరితిఁ దల్లీ! యని యతండు మఱింత ఘోరంబుగా వాపోయిన.

గీ. అతఁడు పలికిన పలుకుల నాలకించి
నయనయుగళిని మోడ్చి "హా నాథ" యనుచుఁ
దూలి నేలను గూలె సతీలలామ
మొదలు నఱికిన యనఁటినున్నోక పోలె.

గీ. కటకటా! దైవ మెంత నిష్కారణ మొక్కొ
సారసంసారవిషయవిస్తారసుఖము
లనఁగ రుచి పూర్తిగా నెఱుంగని కుమారి
నిలకుఁ బెడఁబాపె నేమననేమికలదు.

గీ. ఇట్లు కన్నట్టు నీ జగద్వృత్తమెల్లఁ
జిత్రవర్ణసుగంధమంజిమము తోడ
విచ్చివిచ్చని విరికన్నె వృంత మెడలి
తొరఁగఁ బవనుండు వీచుఁ దుందుడు కదేమొ?

గీ. వలపుఁ జెలికాని మృదుకరస్పర్శనాది
కముల సుఖియించు చిన్నారి కలువకన్నె
నగఁపఱచును ఖరకరాహతులఁ జండ
కరుఁడు కారణమేమొ యెవ్వరికి యెఱుక?

గీ. లలితబిసవల్లికాహారకలన బ్రదుకు
నితర దుర్వృత్తిలేక మాయికమరాళి
బడలుపడ దానిఁ జీకాకుపఱచు ఘనుఁడు
ఘనత గల్గుట యతని కక్కతన నేమొ.

క. మృతిఁ గనెఁ బతి యను వాక్యము
శ్రుతిఁ శూలాహతిగ సోఁక సుశ్లోక పతి
వ్రత ప్రణయలీనమానస
మృత మయ్యెను జగతి నిట్టి మెలఁతలు కలరే?

గీ. తీరుతొలఁగిన మేల్మి బంగారుబొమ్మ
పోలెఁ గూలిన మల్లిక లీల లెంచి
పరవసంతుని బెడిదంపువార్తను విని
అచటివారెల్ల నిశ్చేష్టులైరి వసట.

మ. పతియుం దత్సతియుం మృతింగనుటఁ దద్వార్తసంప్రా
ప్తిచే శతధాభిన్నములై మా హృత్ఫలకముల్ స్వాస్థ్యంబుఁ గోల్పో
యిదు|స్థితిఁ దూలఁ బగకూరి ప్రమందిరవ్యథాంధీభూతచేతస్కు
లా|సతిబంధుల్ తరుణీమణీగుణయశస్సంపత్తి నగ్గించుచుం.

శా. అమ్మా మల్లిక! నీవు నేఁడు శుభమస్తంచుం గడుం భక్తిమై
సమ్మోదమ్మున నోమునోఁచఁ గనువాంఛం వచ్చియయ్యో
య్యో మే|మిమ్మాడ్కిం నినుఁ గోలుపోయి వగచే నిట్లాదు
మంచెప్ప స్వ|ప్నమ్మందైన నెఱుంగమైతిమి గదే నాతల్లి
సాధ్వీమణీ!

చేతులారంగ నాటిన చిన్నితీవె
నాటుకొని కోమలముగ నానాఁటికెదిగి
తేటపుష్పించువేళకుఁ ద్రెంపి వైచెఁ
గటకటా! దైవమున కెంత కటికిమనసొ.

గీ. నీవు నోఁచిననోములు నీ సతీత్వ
గరిమ యే యేటఁ గలసెనే కన్నతల్లి!
పతివియోగాత్తసంతాపవితతదావ
దగ్ధలలితతనూలతాత్వము ఘటిల్లె.

గీ. తగినదాంపత్య మని మిమ్ముఁ దలఁచి ముదము
నందుచుంటిమి, కోరిక లలమికొనఁగ
పడఁతి! నేఁటికె నాశాప్రవాహజలము
లాఱె నీ మృతియను నిదాఘాప్తిఁ జేసి.

వ. అనుచు ననేకప్రకారంబుల శోకించుచు.

శా. చింతాదంతురితాంతరంగలగుహంసీయానలుౝ మల్లికా
కాంతాకాలమృతిప్రమాదభవదుఃఖక్లాంతచేతస్కలై
వంతౝ వందురు బంధువర్గ మునిఁకౝ బైకార్య మెట్లంచు న
త్యంతంబాకులపాటునన్ దలఁచుచున్నంతౝ హాతాద్రీతిగన్

క. ముసిముసి నగవుల పసతోఁ
గసుగందని మోముతో నెకాయెకినడతో
వెస వచ్చె గేహమున కల
వసంతుఁడు తదీయు లెంతొ భ్రాంతిం జూడన్.

గీ. అప్పు డందున్న బందుగు లతనిఁ గౌఁగి
లించుకొని శోకభరత మల్లికవిధంబు
భటుని దుండగమును జెప్పు "భయము వలదు
మూర్ఛసందెను గాఁబోలుఁ బొలఁతి" యనుచు.

చ. తగు నుపచారముల్ సలిపెఁ దత్తరపాటున నవ్వసంతుఁ డె
న్నొగతులఁ దైద్యులాసతితనూలతహస్తములంటిచూచియా
సుగుణకు నీకు నేఁటికి విశుద్ధచరిత్ర! ఋణంబు తీరె మూ
ర్ఛగనుటకాదుకాదనవసంతుఁడుగుండెలుప్రీలిమ్రాన్పడెన్

వ. నిశ్చేష్టుండై పుడమిం బడి యొకింతన తెలివంది
తన సతిం దలఁచి తన యవివేకకృత్యంబు నెంచికొని యతం
డు విలపించె.

చ. మృదుహృదయా! భవద్హృదయవృత్తి మెఱుంగక మూర్ఖ
భావము|గ్మదము౯ మీఁదుగానక ప్రమాదమొనర్చితినింత
మాత్రకి|ట్లదయత శిక్ష సేయఁదగునా? క్షమియింపఁగరాదె? అ
య్యయో|సుదతి! యిఁకేమి నాకుగతిసువ్రత! సఖి విడనాడఁ
బాడియే.

చ. "పతిమృతివార్తవిన్నపయిఁబ్రాణముతోడను నిల్చునే? పతి
వ్రత" యని నీవు నాఁ డనిన వాక్యము నమ్మక నే భవన్మనో
గతినిఁ బరీక్షసేయఁగఁ గుకల్పనఁ జేసితి, నిన్నుఁ గోలుపో
యితి, సరెమొమందభాగ్యుఁడనిసీ! కటుఁబాపినిసుమ్మ ప్రేయసీ

గీ. మృదులనవనీతసుస్నిగ్ధహృదయ నిన్ను
దారుణాసృతధూర్తవార్తాశతఘ్ని
ప్రమంద నేసిన క్రూరకిరాతకుఁడను
తగినశాస్తి యొనర్చితే తరుణినాకు.

గీ. నాఁటి కల యీ విషాదాంతనాటకమున
కిందుముఖి! భావగర్భితనాంది యగుట
నెఱుఁగఁ జాలకపోయితి, మొఱకునైతి
వెడఁగునై కొంప కేఁ జిచ్చుఁ బెట్టుకొంటి.

గీ. కాలునో కాలదో యగ్గికణ మటంచుఁ
బట్టి చూచిన యవివేకి పగిదిఁ బరమ
సాధ్వి! నీ యెడ దుర్బుద్ధిసరణిఁ దలఁచి
తగినఫల మందితిని గదే తలిరుఁబోఁడి.

క. పరమపతివ్రత యని యె
ల్లరు నినుఁ గొనియాడ వినియు లలనామణి! ము
ష్కరుఁడ నయి, పాపి నయి, ని
ష్కరుణుఁడనై యిట్లు నిన్నుఁ గడపితిఁ గాంతా!

సీ. తెలిసి తెలిసి యెంత తెగువకు దిగితినే
బేలనై మానవతీలలామ!
నావంటి నిర్భాగ్యునకు దక్కుదువె నీవు
నాకూర్మి చక్కదనాలచాన!
క్రూరపరీక్షకిఁ గోలుపోయితిఁ గదే
ప్రేయసీ! పరమసాధ్వీమతల్లి!
చేతిమీఁదుఁగ శిరశ్ఛేదమ్ముఁ జేసిన
కరణి యయ్యెనుగదే కలికిమిన్న!

గీ. ముదిత! యెంతటి క్రూరకర్ముఁడనె నేను
యెంతసుకుమార హృదయవే యింతి! నీవు
నిన్నుఁగనేలవిధిదయానిస్వహృదయి
మసల నెడఁబాపె, మనప్రేమ మంటఁగలిపె.

గీ. చెలువ! బెడిదంపువార్త నీ చెవులు సోఁకఁ
"జనియె నాకన్న మున్ను నా సామి"యనుచుఁ
బరువుపరువున నలసటఁ బరువులెత్తి
నాకమును జేరఁ బోయితో నళినయన!

గీ. పరమకల్యాణి! నీ పుణ్యపదపరాగ
మెనసి సోఁకిన యంతనే తనకుఁదాన
కదలి వ్రీలదె నాకంబు గవని తలుపు
పేర్మి నెదురురాఁ దెఱగంటి పేరఁటాండ్రు.

స. నిత్యకల్యాణసందీపితత్రిదశప
త్తనదివ్యఘంటాపథమ్ము లందు
సుకృతపరిపాకశుద్ధమనస్క క
దంబసంభరితసుధర్మ యందు

రంభాముఖాప్సరోరమణీమణీరమ
ణీయశృంగారమందిరము లందు
కమనీయసురభిళసుమనోమనోహర
కల్పలతాకుడుంగముల యందు

గీ. మారుతాధూతవీచికావారచలిత
క్రమగాంగేయవారిజోత్కరపరాగ
కలితసలలితగాంగసైకతము లందు
నెమకుచుంటివి కాఁబోలు నెలఁత! నన్ను.

చ. హరి హరి నన్ను వంటి దురితాత్మునకుఁ వియదాపగావిక
స్వరసరసీజసంజనితసారసుగంధమలిమ్లుచానిలో
త్కరసుఖసంగతిం బొరయఁగా ఘటియిల్లునటే తలోదరీ!
పొరపడి యేటికిఁ వెదకఁబోయెదు స్వస్తటినీతటస్థలిఁ.

ఉ. కర్ణకఠోరకాలమదకాసరకంధరఘంటికారవా
కర్ణనయోగ్య నన్మధురగానసముల్లసదప్సరోగృహా
భ్యర్ణతలంబులఁ దివిషదాయతనమ్ములఁ గల్పభూజసం
కీర్ణవనంబులఁ వెదకి ఖిన్నత నందగనేల? మానినీ!

క. మృతిఁ గనెఁ బతి యన విని స
మ్మతిమెయిఁ బతిననుగమించు మతిమృతిఁగనియో
సతి! స్త్రీలోకమునకు వి
శ్రుతగతి వ్రేసితివి సద్యశోడిండిమముల్.

గీ. నా యబద్ధంపుమృతియె కర్ణముల సోఁకఁ
జచ్చియును జీవసహితవే చాన! నీవు
ఔర! మృతిఁగన్న నిన్నుఁ గన్నారఁ జూచి
బ్రతికియుండియుఁ జచ్చిన వాఁడ నేను.

గీ. అని వసంతుండు విలపించె నతితరముగఁ
బ్రియసతీవియోగగ్లాని బెండగిల్లి
ఫుల్ల మల్లీసుమముఁ గాల డుల్లఁదన్ని
మఱల నా సుమమున కేఁగు మధుపమట్లు.

———

# ప్ర ణ య కు సు మ ము

---

## చ తు ర్ధ శ ము.

క. మృతసతిఁ దోడ నిడుకొని కుం
ఠితమతిఁగడుఁబొగిలియతఁడు డెప్పరమున""నా
సతిఁగలసిమెలసి నేనును
చితదగ్ధుఁడనగుటనాకుచితగతిగాదే?

గీ. ప్రాణపద మగు సతిమేను మేను సోఁక
లీలఁ బవళించు చిత నాకుఁ బూలపాన్పు
పడఁతి నెడఁబాసి నెవ్వగఁ బవ్వళించు
పూలపాన్పైనఁ జితగదా పోల్ప నాకు.

గీ. తగిలె దారవియోగచింతాజ్వరంబు
ప్రబలతాపాన బీటలువాఱె మనము
శకలశకలంబు లయ్యె నిస్సారసుఖము
లేడ?నేనేడ? జగమేడ? నింకమీఁద.

గీ. చితయుఁ జింతయు ననురెంటఁ జితియ మేలు
చిత దహించు నతమ్ము నిర్జీవతనువు
చింత దహియించు నకట! సజీవతనువు
నగునె భరియింపఁ బ్రబలచింతానలంబు.

క. పేర్చుఁడు చిత, సతితో ననుఁ
జేర్చుఁడు చిత, బంధులార! చెచ్చెరఁ గొఱవిన్
దూర్చుఁడు చిత, శోకముఁ బో
కార్చుఁ డుచిత మిద్ది మీకు నరయఁగ నాకున్"

వ. అనుచుఁ బట్టరాని శోకంబున విలపించు నతని బహువిధానునయవాక్యంబుల నూఱడించుచు నతని బంధుగులు.

గీ. పొలఁతి సుఖముగ నింత కాఁపురము సేయు
సుతులఁ గను నంచు నెంచి పొంగితిమి గాని
యిట్టు లగునం చెఱుఁగమైతి మెందు వాన
రాక, ప్రాణముపోక, యెవ్వీకఁ దెలియు.

ఉ. చచ్చినవారికై మనముఁ జచ్చినఁజచ్చినవారు వత్తురే?
హెచ్చినమోహతాపమిటులేఁ చెడునంతియ కానిమాన్పఁగా
వచ్చునెయేరికేనినను నివారణమృత్యుముఖాగ్నికుండమున్ జొ
చ్చెడువంటి; చచ్చుటయుఁజోద్యమె? పుట్టుటయుంజగంబునన్

గీ. మమతచేఁ గుంది శోకించు మనుజుఁ డంతె
కాని కడ కింతయేని శోకమున నష్ట
వస్తులబ్ధి లేదాత్మకున్ గస్తిదక్క
యేలశోకింప? శోషిల్ల నేల? యనుచు.

క. ఊఱడిలఁ బల్క నాతం
డూఱటఁ గనఁజాలఁడయ్యె నురుశోకభర
స్ఫారాగ్నిదగ్ధహృదయున
కూఱట యేరీతిఁగల్గు నుపచారములన్?

వ. అట్టి సమయంబున

సీ. అమలభస్మోద్ధూళనాలంకృతతనుండు
మకుటవత్కృతజటామండలుండు
కటిదేశసంబద్ధకాషాయవసనుండు
మహితకరధృత కమండలుండు

అక్షీణకరుణాకటాక్ష ప్రసారుండు
మందస్మితాస్యాబ్జమండలుండు
పాదుకాపరిలసత్పాదసరోజుండు
మందిరాయిత ధరామండలుండు

గీ. ఎదుటఁ బురవీథిఁ గనుపట్టె నెల్లజనులు
గుములుగుములుగఁ దను జుట్టుకొనుచు నిలువఁ
జారుతరమూర్తి, పుంభావశాంతరసము
పుణ్యుఁడొక్కండు పరమతపోధనుండు.

గీ. విన్నవించిరి మల్లికా విమలచరిత
మృతివిధంబు, వసంతుని వెతయు నచటి
పెద్ద లత్యంతభక్తియు వినయ మొప్ప
నా తపస్వికిఁ; దపసియు నంతలోన.

క. బ్రతికింతు నా సతీమణి
బ్రతికింతు నటంచుఁ గరుణఁ బలుకఁగఁ దుష్య
న్మతి నా వార్త వసంతున
కతిరయమునఁ దెల్పె నొక్కఁ డాప్తుఁడు వెంటన్

వ. తెలిపిన నవ్వసంతుం డత్యంత సంతోషిత స్వాంతుండై పరమపతివ్రత యగు తనసతి పాతివ్రత్యమహత్త్వంబునఁ దన భాగ్యవశంబున జటిరూపంబునఁ దనకు భగవంతుండు సాక్షాత్కరించెనను ముదంబునఁ బరవశుండై.

క. జటియై నను సతి రక్షిం
చుటకై యిటనుద్భవించెఁ జాఁడి? యీశుఁడహో
జటియాటకేమి యొకపరి
కిటియైన పరాత్పరుండు కృపగల్గినచోన్.

క. అని "సత్వరగతిజటిలుం
గని మ్రొక్కుదుఁ గాక పరముఁ గరుణామయునేఁ
గొని తెత్తుఁగాక సతిమృతి
యనృతం బొనరింతుఁగాక" యనుకొనుచుఁ జనన్

గీ. ఏలొకో చేతి కుండిక నేలఁ గొట్టి
శకలముల నేఱికొనుచు డింబకను దలఁచి
తలఁచి శోకింపసాగెఁ దత్రత్యజనులు
నా వసంతుఁడు రిచ్ఛపాటందఁ దపసి.

వ. అంతనవ్వసంతుండు.

మ. కరుణాశీతలసత్కటాక్షముల శోకజ్వాలఁ జల్లార్ప నా
తరుణిన్ సంసృతి ఘోరవార్ధి తరణిన్ద్రిప్పించు మృత్యుగ్రహో
దరగోళంబుననుండియీతఁడనునుత్సాహంబుతో వచ్చితిన్వ
రకర్మందియితంబునేడ్వఁదొడఁగెన్ వైరాగ్యమొందున్నదో?

సీ. తల్లిదండ్రులతోడఁ దనకున్న సంబంధ
గతికి నివాపోదకమ్ము వదలి
ప్రౌఢకాంతాతనూపరిరంభణాదిక
సౌఖ్యమ్ములకు జలాంజలినొసంగి
పుత్త్రమిత్రాదికమోహమ్ముస్నేహమ్ము
లను పాశముల మొదలంటఁ గోసి
బంధుగేహారామపశ్వాదిసంసార
హేతుకసంగంబు నేటఁగలపి

గీ. మమత దిగఁద్రావి దేహాభిమాన మడఁచి
రాగమును రూపు మాపి విరాగి యైన
పురుషునకు నేటి భయశోకములు నిఁకేటి
కామక్రోధాదు లెయ్యది కాంక్షితంబు.

మ. వనటంగుందివిరాగియున్వగచుచో "వైరాగ్యమేవాభయ"
మ్మను ప్రాజ్ఞోక్తి నిరర్థకంబగుఁగదా? ఆశ్చర్యమా! నీతపో
ధనుఁ డల్పంబగుకాంతకై యిటు విషాదంబందునన్నెట్లుతా
ననునీతుం బొనరింపనేర్చునువృథాయాసంబె కాకింతయుః

గీ. అని నిరాశను జెందియు నైన నితని
భావ మెట్టిదో కనుఁగొనవలయుఁదలచి
యని వసంతుఁడు జటి కిట్టులనియె నంత
నిజసతీప్రేమనిఘ్నాత్మ నిబ్బరముగ.

సీ. పల్లవారుణసముద్భటజటారింఛోళిఁ
బెంచి, యాశాలతఁ ద్రెంచి తీవు
సలిలకాషాయ వస్త్రముగట్టిగాదట్టి
గట్టి కామముతలమెట్టి తీవు
నిర్మలదేహంబు నిండార భస్మంబుఁ
బూసి మోహముఁ గడఁద్రోసి తీవు
నీవారశాకపత్రావళిభుక్తిగా
నిలిచి లోకమ్మునుగెలిచి తీవు

గీ. యోగివరుఁడవు స్వీకృతభోగివరయు
సిద్ధమతి వీవు మఱియు జితేంద్రియుఁడవు
నిట్టి నీ కింక వలసిన దేమి జగతి
నిట్లు శోకింప జటివరా! హేతువేమి?

చ. అవిరతకామరోషవిషయాదులఁ జిక్కి దురుద్ధరాజవం
జవమున మున్గు మాదృశుల చందమునన్ విలపించె దేటికీ
వవశమనీష నోజటివరా! యొక మృణ్మయపాత్రకోస మి
ట్టి వికృతి నందనేమిటికి డెందమునన్ గలఁగంగ నేటికిన్.

క. అల్పపుమృత్కుండికకు ది
గుల్పడఁగా నేల? మట్టికుండ నిలుచునే
కల్పముల కొలఁది; వగవ న
నల్పమతీ! రాగరహిత! న్యాయమె నీకున్.

వ. అను వసంతునకు సప్పరివ్రాజకుండు.

గీ. పదిరె దెవ్వరివాఁడ వో పసుచువాఁడ!
అప్రతిమము ననేక గుణప్రణయిని
చారురూపిణి జీవనాధారమైన
దిద్ది, యిద్దానిగుణము నీ కేమి యెఱుక?

క. ఈ కుండికపై నెంతగ
నా కుండెనొ ప్రేమ తెలియునా? భుజియింపన్
లేకుండిన సరె, యిది కన
రాకుండిన నిలుపఁజాలఁ బ్రాణము తృటియున్.

గీ. ఓయి వేదాంతి! నా కుండికోత్తమంబు
నల్ప మనియెద విదియె నా కతిఘనంబు
ప్రణయపరిణద్ధవస్తు వల్పంబు నధిక
మనెడు భేదము తోఁచునే యాత్మకెపుడు.

గీ. మృణ్మయం బని నిరసించె దేటి కోయి
ప్రేమతత్త్వంబు నెఱుఁగని పిన్నవాఁడ!
మృణ్మయం బైన కాక హిరణ్మయం బె
యైన వెలసమమే ప్రణయాపణమున.

చ. అనుజటికిన్ వసంతుఁడనునార్యభవద్వచనం బమోఘమౌ
నెనయఁగఁ బ్రేమవస్తువున కెవ్వఁడియత్తను దెల్పనేర్చునే
నను దలపోయ వస్తువు చనన్ బ్రతికార మశక్యమైన య
ష్టనువగునే? వగంబొగుల నట్టి విషాదము కార్యకారియో?

గీ. ఎఱిఁగి యెఱింగియు వితగా
దురపిల్లుట తగునె? యనుచుఁ దుందుడుకుమెయిన్
దుఱతుఱఁ బల్కు వసంతుని
గరుణారస మొల్కఁ దపసి కని యిట్లనియెన్.

క. ఏ కార్యమునకు నైనఁ బ్ర
తీకారము తోఁపనప్డె దిగ్గురను మనం
బీకార్యము సహజముగద
లోకంబున నరసి చూడ లోకవిధిజ్ఞా.

సీ. స్వర్గపురిఁ జేరఁ జనియెడు తల్లిదం
డ్రులకయి వగచు తనూభవుండు
తమకు దూరగుఁడయి తరలిపోయెడు కూర్మి
తనయునకై కుందు తల్లిదండ్రు
లేకశరీరమ ల్లైనసియుఁ దనుఁ బాయు
భర్తకై శోకించు పరమసాధ్వి
తనకు నర్ధాంగియై తనరియుఁ గడచను
పడఁతికై విలపించు ప్రాణవిభుఁడు.

గీ. లేదు నగపునఁ బ్రతికారలేశమనుటఁ
దెలియమిని నగచెద రంచుఁ దలఁతువొక్కొ?
యెఱుగుదురు వారు నొక్కింత సృష్టితెఱఁగు
యెఱుకయే శోకకారణ మింత కరయ.

వ. అట్టి వారల రీతిఁ గాక నేన యీ కుండిక దృఢత్వముం బరీక్షించుతలంపున నేలంగొట్టి పోనడచితిఁ గాన సంతాపంబు నాకుఁ గడుంగడు నధికంబన వసంతుండు కనుల నీరునించి మహాత్మా! తానే ప్రియవస్తువును నశింపఁజేసికొన్నప్పు, డను తాపంబునకు మేరలేదు;అయిన నదియగదా యజ్ఞానంబు.

క. భ్రమమున మున్గి ప్రపంచ
క్రమ మెఱుఁగక నగచు టంతెకాక జటీంద్రో
త్తమ! "యద్దృశ్యం తన్న
శ్య" మనఁగ వినలేదె మనము సారెకు శ్రుతులన్.

గీ. అదియునుం గాక ప్రియ మప్రియంబు నెందు
ప్రాగ్భవీయంబు లైన కర్మముల వలన
నంతనంతను ఘటియిల్లు నంతెకాని
పురుషుఁ డెవ్వండు ఘానరింపఁ బూర్ణహృదయ!

క. అను పల్కుల కల్లన నగి
యనువందఁగ నని జటీశుఁ డగునగునోయీ
యనుతాపం బజ్ఞానజ
మను నీ వచనంబు సత్య మది యెట్లున్నన్.

గీ. తాను చీఁకటిలో మున్గి తడవికొనుచు
దీప మొకనికిఁ జూపింప దివురు వాని
భాతి నీ వేమొ వేదాంతవాక్యములను
నాకుఁ జెల్పుటమాత్ర మెంతయును వింత.

చ. జటివరుఁ డట్లు పల్కిన వసంతుఁడు స్వాంతముపల్లవింపఁ దా
త్కటమగుభక్తి నాతనిపదంబులవ్రాలి "మహానుభావ! యీ
అట ఘటియిల్లె నాకు నచిరంబుగఁ దావకబోధవాక్యసం
ఘటనఁగదుర్గ్రకృతార్థతయుఁ గల్గెఁదరించితిదుఃఖవారిధిన్.

క. నా వాక్యమ్ములనను వి
ద్యావిదుఁ బొనరించి తీవు తత్త్వార్థవిదే
శా! వదలె మోహపాశము
లేవలనను లేదు దుఃఖ మీపయినాకున్.

క. కరుణించి యింకఁ బయినెది
కరణీయము? సచ్చిదాత్మఁ గనుఁగొన వెర వే
కరణిని సిద్ధించునొ నా
కిరవుగఁ దన్మార్గ మింత యెఱిఁగింపఁగదే.

వ. అనుచుఁ బ్రార్థనమ్ముసేయు వసంతకుమారు నను
గ్రహించి సంయమీశ్వరుండు.

గీ. దుఃఖ నిశితహాలంబున దున్నఁబడి స
మగ్ర వస్తు వివేక రసావసేక
మొనసి నీ చిత్తసీమ యిప్డనువుపడియె
సత్యసుఖదంబు జ్ఞానబీజంబు నాట.

గీ. విషయసుఖములకై సుంత వేడ్కఁ గొనక
పరముననునిల్పు మనము సుస్థిరముగాఁగఁ
దివిరికననేర్తువవల జ్యోతిస్స్వరూపు
స్వప్రకాశుఁ జిదానందు సర్వమయుని.

గీ. శోకసులభంబు వైరాగ్య సుఖము, దానఁ
బొందఁగావచ్చు నవ్వల ముక్తిపదము
దాని నటులుంచి ప్రథమకర్తవ్య మింకఁ
దెలిసికొనవోయి వివరింతుఁ దేటపడఁగ.

క. వైరాగ్యబీజ భూతం
బారయనీనారియగుటనా సతి నిన్నుం
జేరిచి యీ నిర్వేదపు
భారముతోలఁగింతు సుఖముపడయుము సతితోన్

వ. అనిన సన్న్యాసంతుండు.

గీ. శుద్ధచారిత్ర నిర్వాణ సుఖముఁదప్ప
లవము నేఁ గోరనింకఁ గళత్ర పుత్త్రి
మిత్ర సంబంధి సుఖము నేమాత్రమేని
రాజ్యమే నొల్ల నొల్ల స్వారాజ్యమేని.

చ. దరి కెగఁబ్రాఁకు వానికి నిదానముగాఁ గరమూఁతయిచ్చియు
ద్ధరణ మొనర్పకే యదయతన్ జలధిం బడఁద్రోయురీతి నో
పరమమునీంద్ర! సంసరణబాధలనుండితరింపనున్ననన్ । మఱ
లనధోగతింబొరయుమాయనన్యాయ మెమిమ్ముబోంట్లకున్?

క. తలఁపఁగ సంస్కృతిబంధం
బులఁ దగిలి కృశించు మూఢపురుషుండు యుగం
బులకొలఁది మనినఁ గనుఁగొనఁ
గలఁడే పరమాత్మఁ గాంచఁ గలఁడే ముక్తిన్.

క. అని ప్రశ్నించు వసంతుని
మనమునఁ గల సంశయముల మహితాత్ముఁడుమ
న్ననఁ దీర్చి జ్ఞానాంకుర
మును నాటెఁ దదీయచిత్తభూమిన్ బిదపన్.

క. జనకుఁడు కుటుంబి కాఁడే? సంసార మతని
కడ్డమయ్యెనె? జ్ఞానమార్గావలంబి
కెందు నష్టంబు లేదు; జితేంద్రియుఁడవు
కమ్ము తెలిసి కుటుంబివి కమ్ము పొమ్ము.

చ. అనుచు జటీంద్రుఁ డంత సముదారతమల్లికయున్న చోటికిన్
జని కరుణాకటాక్షములఁ జక్కఁగఁ జూచిన యంతమాత్రనా
వనితయు నిద్రమేల్కనెడు భంగిఁ జివాలున లేచి యమ్మహా
త్ముని పదపంకజంబులను దొరవుభక్తిని వ్రాలి మ్రొక్కినన్

క. "నారాయణ" యని మాత్రము
నోరార వచించి యతఁ డనూనమహాత్వో
దారత నంతర్ధానము
నారూఢిం జెందెఁ బౌరు లచ్చెరువందన్.

క. మృతిఁగన్న మల్లికాసతి
నితఁ డౌరా యింతలోన నెటు పునరుజ్జీ
విత సల్పె నంచుఁ బౌర
ప్రతతి వితర్కించె యోగబలమెఱుఁగమిచే.

సీ. భయదాబ్ధి నఱచేతఁ బట్టి త్రావఁడె జగ
ద్వంద్యుఁ డొక్కఁడు యోగబలముచేత
సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసి నిల్పఁడె ఋషి
ప్రవరుఁ డొక్కఁడు యోగబలముచేత
మృతసతీసుతులను బ్రతికింపఁడే తపః
ప్రథితుఁ డొక్కఁడు యోగబలముచేత
వెన్నున కఱకాలఁ గన్నుఁ జూపింపఁడే
ప్రజ్ఞ కొక్కఁడు యోగబలముచేత

గీ. నెంద ఱెందఱొ మహనీయు లెన్నొ గతులఁ
జూపియుండరె. తమ తపశ్శుద్ధి యోగ
బలము, దాని నెఱుంగు ధీబలము లేక
లోకు లేమేమొ యుఱక పల్కుదురు గాక.

గీ. అనృతదుస్సహావార్తామహాతపమున
వాడి వ్రాలిన మల్లికావల్లి జటిల
శేఖరకృపారసామృతసేచనమున
మఱల నెప్పటి యట్లయి వరలె, సంత.

క. సంతోషంబునఁ బొంగి వ
సంతుఁడు తన రమణిఁ జేర్చి సరగున బాహా
భ్యంతరసీమకుఁ దగ న
క్కాంతయుఁ దన రమణుఁ గవిసెఁ గౌతుకమలరన్.

గీ. అప్పుడెల్లరకును తోష ముప్పతిల్లె
మల్లికాకాంత సుఖముండె మది ముదం బె
సఁగ, వసంతునిఁ గూడి; వసంతుఁ గూడి
లీల సుఖముండు నవ్యమల్లికయు పోలె.